# రజపుత్ర రాణి

ఐదంకముల నాటకము

రచయిత :

ప్రత్తిగొడుపు రాఘవరాజు

పబ్లిషర్సు :

సుమతీ బ్రదర్సు, తెనాలి.

1948

 [వెల రు 1-4-0

# JHANSY RANI


బంధకవికేసరి కవివసంత,

ప్రత్తిగొడుపు రాఘవరాజు



పబ్లిషర్సు :

సుమతీ బ్రదర్సు, తెనాలి.

1948





[వెల రు 1-4-0

# ప్రకటన

ఝాన్సీరాణియొక్క సమస్తహక్కులు నాకు చెంది యున్నవి. నా వ్రాతమూలకమైన అధికార పత్రమును బొందనిదే అంతయుగాని కొంతగాని ముద్రించుట భాషాంతరీకరించుట, గ్రామఫోను రికార్డింగు చేయుట, టాకీ స్క్రీనింగు చేయుట ప్రదర్శించుట, మొదలగు దొంగపనులు చేయగూడదు. యిందుల కతిక్రమించినవారలు నా నష్టమునకు బాధ్యులగుటయే గాక నేను జరుపబడు సివిల్, క్రిమినల్, చర్యలకు పాల్పడుదురని యిందుమూలముగా తెలియజేయడమైనది.

ఇట్లు

ప్రత్తిగొడుపు రాఘవరాజు

ముద్రాపకులు : ఆంధ్రరత్న ప్రెస్, తెనాలి.

టెంపరరీకార్డు కోటాతో 500 కాపీలు.

# విప్లవ జోహార్

సీ. వీక్షింపుచున్నాడు ♦ విశ్వమానవజాతి
గాంచు సారస్వత ♦ గ్రంథసమితి
వలపించు చున్నాడు ♦ తెలుగు సీమలనెల్ల
రైతుకూలీ ప్రజా ♦ రాజ్య లక్ష్మి
ప్రేమింపు చున్నాడు ♦ బీదవిద్యార్థుల
రోదల కంపించెడి ♦ హృదయ సీమ
చే యెత్తుచున్నాడు ♦ జీర్ణవస్త్రమ్ముల
కుమిలి పోయెడి ♦ జీవకోటి మనుప

తే. గీ. కసరుచున్నాడు నిరుపేద ♦ కడుపు కొట్టి
కవుల కలముల గ్లాసులో ♦ గద్దె గరువ
పరువులెత్తించు గజదొంగ ♦ వర్తకులను
రమ్య గుణగణ కీర్తి మా ♦ రామమూర్తి

సీ. కళకళ లాడెడి ♦ తెలుగు జోదులకీర్తి
కవ్వించి నల్దెసల్ ♦ గప్పునాడు
బొట్టుబొట్టుకు త్యాగ ♦ భోగమ్ము గల్పించు
కలముల నెత్తురు ♦ గ్రక్కునాడు
చివికిపోయిన దేశ ♦ శిల్పకళోద్ధతుల్
పదియారు కళలతో ♦ బ్రతుకునాడు
స్వార్థ పిశాచ దం ♦ ష్ట్రల నుగునుగైన
దేశ సంపద తీర్చి ♦ దిద్దునాడు

తే. గీ. కుల మతోన్మాద విష వృక్ష ♦ ముల పెకల్చి
మించి మానవజాతి ప్రే ♦ మించునాడు
కన్నగడ్డకు శాంతిగా ♦ కలలు గాంచు
రమ్య గుణగణ కీర్తి మా ♦ రామమూర్తి

చం. కలమున నాగు నెత్తుటను ♦ గప్పిన యుగ్రోగ్రుల అక్షరమ్ములన్
జలికెడి విప్లవాగ్నులు స ♦ జీవములై చెలువారుచున్న చో
మలమలమాడు క్రైతులకు ♦ మానము దక్కదటంచు నెందుమీ
[illegible] ♦ దన్నుచు దైవసహాయ మయ్యెడిన్

ఉ. [illegible] కీర్తనముల ♦ [illegible] కై తలలోనిగారముల్
[illegible] ♦ [illegible] స్వార్థపిశాచ [illegible]లన్
[illegible] ♦ [illegible]ముల్ ధర[illegible]
[illegible] యుదా[illegible] ♦ జోహారుముల్ కవిలోకసత్తమా

చం. [illegible] ♦ పోయిన రక్తముం[illegible]యై
[illegible] ♦ తల్లి మథించిన ఆంధ్రభాషపై
వి[illegible] ♦ విప్పిన చల్లని తండ్రి నేడునా
[illegible] ♦ [illegible] వహియించె నుర్విపై

తే. గీ. కలము హాలమును మీకేల ♦ కులుకుగాన
కాలగర్భమ్మునన్ జడి ♦ కాంతిదప్పి
ప్రాణముల గుప్పిటన్ బట్టి ♦ బ్రతుకుచున్న
కవికలమ్మున కొక క్రొత్త ♦ కాంతి గల్గె

ఉ. ఆపడి బెట్టి కోడరిక ♦ మత్త సహింపక జోలెనిచ్చియూ
రూరను ద్రిప్పుచున్నది అ ♦ యోయను నోముకు నోచదే సరే
జారిణిగాదు సర్వగుణ ♦ సంభవ కెవ్వరుదిక్కటంచు నీ
కారుణిక ప్రసూనముల ♦ కైతలజల్లితివా దయానిధీ

ఉ. ఆకటి మంటలంబరము ♦ నంటిన పేదల పచ్చిరక్తముల్
బాకులజిమ్మి తద్రుధిర ♦ పానమునన్ తలమున్కలైన పీ
డాకరలోక సంపదల ♦ కాస వహింపని ప్రాజ్ఞురాలిగా
నా కవితా కుమారిని ఘృ ♦ ణారస దృక్కుల నుద్ధరించితే

చం. కులమును అంటుజాడ్యమున ♦ కుం బలియైన పిశాచభూమిలోఁ
కలములు మొద్దువారి తన ♦ ఖామెయిగప్పిన చచ్చువాతలన్
పిలువని పెత్తనమ్మునకు ♦ బిక్కమొగమ్మున నేగుకై తలన్
దలచిన గుండె బ్రద్దలగు ♦ దాస్యము నచ్చిన గ్రుడ్డి సట్లగన్

శా. దేశశ్రేయము గోరి వ్రాయుమని యా ♦ దేశింతువే కాని యే
యాశంజూపవ గ్రంధముద్రణకునై ♦ యర్థమ్ము చేకూర్చి అ
ష్టాశాంతమ్ముల కీర్తినింపెడి తలం ♦ పా జన్మసంస్కారమా
హాశం శెట్టికుల ప్రతిష్ఠలివియా ♦ పొల్పార నీనైజమా

ఉ. ఒక్కొక వత్సరమ్మునకు ♦ నొక్కొక గ్రంథము ముద్రణమ్ముకై
రొక్కము గూర్తునంచెవడు ♦ రొమ్మును గొట్టి వచించెమున్నన
ల్దిక్కులలోన గుండెగల ♦ దిట్టపుగావున పల్కు పల్కునన్
చిక్కని దేశభక్తి తమి ♦ చిందులు ద్రొక్కుచు పొంగిపొర్లెడిన్

ఉ. కూరకు నారకున్ కవిత ♦ గుప్పి కవీంద్రులు కూటి గుడ్డకున్
భోరున నేడ్చినా డొకడు ♦ పోచ యొసంగడుగాని చచ్చుచో
స్మారక చిహ్నమా సభలు ♦ సంతబజారుల సానుభూత్యు లూ
రూర జపించు లోకమున ♦ కూపిరి పోసితివా దయానిధీ

తే. గీ. కవిత, సుందరి, లత, దేశ ♦ కాలపాత్ర
గతులను పరాశ్రయమ్మున ♦ బ్రతుకుచుండు
ప్రేమబిక్షుల భోజుడే ♦ పెట్టకున్న
కాళిదాసాది కవులకే ♦ గతులులేవు

చం. వుడిసెడు గంజికేన్ కడవ ♦ పోతల నేడ్చెడు పంటి గ్రుడ్డికిన్
పిడికెడు బిక్షపెట్టగల ♦ ప్రేమ మనీషులు గొడ్డుబోయె యే
బుడుతల పెండ్లికో మురిగి ♦ పోవు కులోద్ధతి కోధనమ్ములన్
కడవల గ్రుమ్మరించు పర ♦ కర్మలకున్ గుణపాఠ మిచ్చితే

సీ. కుమిలిపోయిన గర్భగోళమ్ములన౯ లేచు
ఆకలిమంటల ♦ అదిమి అదిమి
యెండిపోయిన బక్క ♦ కండలం జీర్ణించు
కన్నీటిలో మేను ♦ కడిగి కడిగి
రాలిపోయిన శల్య ♦ రాసిలో వినవచ్చు
వేడి నిట్టూర్పుల ♦ విసరి విసరి
గొడ్డుబోయిన కన్న ♦ గడ్డ శౌర్యాగ్నుల
పలుమారు గేయాల ♦ పాడి పాడి

తే. గీ. తనివిదీరక మనసార ♦ తరచి తరచి
దేశసౌభాగ్యరేఖల ♦ దిద్ది దిద్ది
గ్రాసవాసంబులకు గతి ♦ గానరాని
కవికుమారులపై యింత ♦ కరుణయేల.

సీ. పరికించితే దేశ ♦ భాషామతల్లుల
నిగనిగలాడు క ♦ న్నీటిజాలు
గాలించితే క్షుధా ♦ జ్వాలల కంపించి
చెదలు పట్టిన కవి ♦ హృదయ సీమ
ఆలించితే దేశ ♦ కాలాను గుణ్యమా
జాతీయ విద్యా వి ♦ షాద గాథ
తలపోసితే తెల్గు ♦ తల్లి పొత్తిళ్ళలో
కించురాపరి ప ♦ తాక దీపి

తే. గీ. ఎంతప్రేమ రసామృత ♦ వృష్టి గురిసె
ఎంతసత్య పథాన్వేష ♦ దృష్టి నిగిడె
ఎంతజాతీయపుష్టి నీ ♦ చెంత గలిగె
కవికుమారులపై యింత ♦ కరుణయేల

క. కవివట స్వతంత్రపథమున
వివశత్వమునందుకర్మ ♦ వేత్తవుసట నీ
భవమా లోకహితంబట
కవిలోకం బెంతకైన ♦ గర్వింపదటే.

ఉ. చాచినచేయి ముందునకు ♦ జాపియొసంగెడి యీవిజన్మతో
దాచిన సత్యవాక్పటిమ ♦ తాతలనాటి యశంబు తంగెడున్
జూచిన పుత్రలాభము వి ♦ భూతిమహత్వము కైత నిగ్గులన్
నోచిన నోముగా కిటు ని ♦ నున్ వరియించునె రామమూర్తిజీ.

వసంతతిలక వృత్తము

దరిద్రకోటి మన్నగా ను ♦ దారబుద్ధి గల్గటల్
వరాల కైతలో విశిష్ట ♦ భావముల్ గ్రహించుటల్
చరిత్రలోని దేశభక్తి ♦ సంగ్రహించి పల్కుటల్
పురాకృతంపు కర్మయోగ ♦ పుణ్యవశత గల్గెడిన్.

మ. కవివై దాతవునై స్వదేశమునకున్ ♦ గార్యంబుచుట్టంబవై
భువిపై విద్యయు సద్ధనంబు జవమున్ ♦ బొలార్పుమీ కండవై
ధవుగా, మిత్రునిగా, కృపామయునిగా ♦ ధ్యానించునర్సమ్మకున్
కవిలోకంబు ఋణంబుదీర్ప దగున ♦ న్నా వేయిజన్మాలకున్.

ఉ. శ్రీమహిమాతిశిష్టగుణ ♦ శీలుడవై నిరతాన్నదాతవై
కామిత కల్పభూజమన ♦ గా నుతిగాంచిన రామమూర్తివై
ప్రేమకవీంద్ర మిమ్ముగని ♦ పెంచిన నారయ సూరమాంబలే
నోముల నోచి సత్ఫలమునున్ ♦ గనెనో కవిరాజపోషణా.

మ. కులమున్ గోత్రము వల్లెవేసి బలిమిన్ ♦ గోరంత కొండంతగా
తలయున్ తోకయులేని పద్యములతో ♦ తప్పొప్పులన్ గుప్ప నా
కలమున్ జాచగ లేదు దేశహిత దీ ♦ క్షన్ గూర్పునీ యీవికిన్
బలమున్ భాగ్యముగా శతాయువులుగా ♦ ప్రార్థింతునశ్రాంతమున్

ఉ. కాపుపదమ్ము రక్షకుని ♦ గా రచియించిన శబ్దరాశి చి
త్రూపము స్వార్థజీవనప ♦ రుల్ తలక్రిందుగద్రిప్పి శూద్రు లీ
కాపు లటన్న దుందుడుకు ♦ గద్దరిఘాతల కేమిగాని నీ
కాపుపదమ్ము సార్థకత ♦ గాంచెనుగా సుజనావనప్రియా.

క. ఆశాతీతుండవు నీ
దేశక్షేమాభిలాష ♦ దిద్దిన భక్త్యా
వేశుడవు సాధుమూర్తివి
పోశంశెట్టి కులవార్థి ♦ పూర్ణశశాంకా,

సీ. పేమించి మహాలక్ష్మి ♦ పెద్దకుమారుగా
గనుట శ్రీ నీ వెను ♦ గాచెనేమొ
ప్రీతి రాఘవరావు ♦ రెండవ పుత్రుగా
గనుట సత్యము నిన్ను ♦ గాచెనేమొ
మురిసి రంగారావు ♦ మూడవ పుత్రుగా
గనుట భోగము లింట ♦ గాచెనేమొ
ధర చతుర్థుని శేష ♦ గిరిరావు పుత్రుగా
గనుట ధైర్యము నిన్ను గాచెనేమొ

తే. గీ. నాల్గుదిక్కుల రీతిగా ♦ నల్వుర గని
నడచుచున్నాడవా కీర్తి ♦ నొకపయిని
కొదువ యేమున్నదీ జీవ ♦ కోటి మనుప
అమలగుణధామ దేశసే ♦ వాభి రామ.

తే. గీ. కాగితములలోన ♦ కలవు రక్కసి యుంట
కలము గదలకుండె ♦ గాని తండ్రి
దేశదేశములను ♦ తీర్చి నీ విఖ్యాతి
చాటు తెలుగుసీమ ♦ గీటురాయి.

# అశ్రుతర్పణం

సీ. ఆ బోసినోటిలో ♦ గోబూచులాడెనా
విశ్వజీవనరక్తి ♦ వేదసూక్తి
ఆ బక్కడొక్కలో ♦ నావిర్భవించెనా
పరిపంథిహృదయాల ♦ ప్రళయకీల
ఆ రాట్నలక్ష్మిలో ♦ బీరమ్ము గుప్పెనా
సర్వమతాస్థి ♦ శాంతినిష్ఠ
ఆ నూలుపోగులో ♦ గానమ్మొనర్చెనా
స్వాతంత్ర్యపథహక్కు ♦ సత్యవాక్కు.

తే. గీ. ఆ యజాతవైరమ్మును, ♦ అగ్నిలోన
కులమతోన్మాదముల నూన ♦ కోత గోసి
రామరాజ్యంబుకొరకు పో♦రాడుతండ్రి
కటకటా! గాంధిదేవుడు ♦ కాలిపోయె.

# ఇందు వచ్చు పాత్రలు

| | | |
|---|---|---|
| ఝాన్సీరాణి | — | కథానాయకి |
| మోరోపంతు | — | మహారాణి జనకుడు |
| దామోదరరావు | — | రాణి దత్తపుత్రుడు |
| రామచంద్రరావు | — | దేశముఖు |
| దులాజీరావు | — | ప్రభువంశీకుడు (దేశద్రోహి) |
| రోజుదొర | — | బ్రిటీషుసర్వసైన్యాధిపతి |
| విశ్వపతి | — | యుద్ధవార్తాహరుడు |
| రావుసాహెబు | — | పీష్వా (కాల్పి నేత) |
| తాంతియా | — | రావుసాహెబు సర్వసైన్యాధిపతి |
| ఖాందానవాబు | — | ముస్లిం దేశభక్తుడు |
| జియాజీరావు | — | గ్వాలియర్ సంస్థానాధిపతి |
| కళ | — | బ్రిటీషు గూఢచారి |

# నాంది

శా. శ్రీమద్భారత భూమిబంధుర యశ ♦ శ్రీ దేశ దేశమ్ములన్
పేరున్ నిల్పదలంచి రోజుదొరదో ♦ ర్వీర్యంబు ఛేదించి త
ద్భీమపక్రియపారి విప్లవ మహా ♦ బీజంబులన్ జల్లు ల
క్ష్మాత్మ కరుణామయున్ ప్రథితఝా ♦ న్సీరాణినిన్ వేడెదన్.



జాతీయవిద్యాకళాభిమానులును ద్రవ్యదాతలు నగు

## శ్రీయుత పోశంశెట్టి రామమూర్తిగారు

అ డ వి కొ ల ను

పశ్చిమగోదావరి జిల్లా - తాడేపల్లిగూడెం తాలూకా



గ్రంథకర్త :

బంధకవి కేసరి కవివసంత

# ప్రత్తిగోడుపు రాఘవరాజు

# ఝాన్సీ రాణి

## (ప్రథమాంకము)

మొదటిరంగము స్థలము ఝాన్సీకోట మోరోపంతు బలాజీరావు-దామోదర రావు రామచంద్ర దేశముఖులు కూర్చొనియుందురు. మహారాణీ లక్ష్మీబాయి సభా వేదికపై నిలబడియుండును. (తెర యెత్తబడును.)

రాణి:- ఓ దేశభక్తులారా స్వాతంత్ర్య యోధులారా లెండు, నేడు మీ కన్నగడ్డను కాపాడుకొనుటకు సిద్ధముగుండు. వీరసింహదేవ్ నిర్మించిన అభేద్యమైన ఝాన్సీకోట రక్షణకై మీ మీ ఆత్మ త్యాగ మొనర్పుడు. అపుత్రస్య గతిర్నాస్తి యను శాస్త్ర ఘోషకే కుమిలిపోయిన మహారాజా గంగాధరరావునకు తాను కోరిన అర్భకుని బెంచుకొను అర్హత లేదా? మహారాణీ అనంతరము దత్తపుత్రునకు ఝాన్సీరాజ్యము సంక్రమింప వలెనను గంగాధరరావు వీలునామా భూస్థాపితమై పోవలసిన దేనా? సస్యశ్యామలయై రత్నగర్భయై ధర్మజ్యోతియైన భారతదేశం సత్యధర్మ నిర్ణయము చేయు హక్కు లేదా? న్యాయాన్యాయ విచారణదక్షుడై సర్వాంతర్యామియై దుష్ట శిక్షణను శిష్ట రక్షణను బద్ధకంకణ హస్తుడైన భగవానుడు లేడా? కర్మసాక్షియైన జగచ్చక్షువు అంతరించెనా? గత చరిత్రను విస్మరించి, మనమిప్పుడేమి చేయవలెననెడి ప్రధానాంశమును చర్చింపబూనుట సమంజసము, దాక్షిణ్య రహితులై, పరరాజ్యముల కొల్లగొట్టుటే, తమ ప్రధానాశయము గల యీ పైశాచిక ప్రభుత్వమునకు దాసోహమ్మని తలయొగ్గుటయో. ఆత్మగౌరవముకొరకు, ఆంగ్లేయ క్రోధాగ్నిలో భస్మీభూతమై పోవుటయో, మనకర్తవ్యము నేడు ప్రధాన సమస్యలు రెండును, నా ప్రజలైన మీముందు బెట్టుచున్నాను, యిదమిద్ధమని నిర్ణయించు అధికారము మీతలపై నున్నది.

శత్రువుల రాచనీతి విమర్శించి ప్రయోజనము లేదు, అమాయ ప్రజామారణహోమ యజ్ఞమే వారి దృక్పథము. రక్త దాహమే వారి రాక్షసరాజ్యాంగ తంత్రము. దండనోపాయమే వారి అంతిమలక్ష్యం. (అంత తెరలో చప్పట్లు) స్వతంత్ర యోధుల మైన మనలక్ష్యమో జయాపజయములతో పనిలేదు. చావు బ్రతుకులతో సంబంధము లేదు. స్త్రీ పురుష విభేదం లేదు, మృత్యుదేవతను ఆనందముతో ఆహ్వానించుట మనకర్తవ్యం యీ లక్ష్యసిద్ధిగల్గేవరకు, సమరరంగములో నిహతులైన దేశభక్తుల శవరాసిపై ప్రళయతాండవం చేద్దాము. వీరులకు జన్మహక్కుగాని భీరులకు నవభారతంలో స్థానంలేదని రణభేరి మ్రోగించుదాం. మన విద్యుక్తధర్మం రణము. రణప్రదర్శ నముయొక్క మహదాశయము వీరమరణము, మీ ప్రేమా రాధనదైవము మరణము. మీ తారకమంత్రం మరణం మీ ధ్యానం మరణం మీ మననం మరణం ఇది మాతృభూమి ఆదేశము (అంత తెరలో మరల కరతాళధ్వనులు)

రాణి:- (ఒరనున్న ఖడ్గమును దూసి) ఓ వీరయోధులారా నేడీ స్వాతంత్ర్య సమరమునందీ ఖడ్గసహాయమే అజేయ స్వేచ్ఛా ప్రవృత్తి కల్పింపగలదు. మాతృదేశ సేవారాధకుడై మహా రాణా ప్రతాప యీ ఖడ్గసహాయము వహించి శత్రువుల నిర్జించి అమరకీర్తి నార్జించినాడు. స్వైరవిహారియై ఛత్రపతి శివాజీ యీ ఖడ్గబల సహాయమాకాంక్షించి ఢిల్లీపాదుషా నోడించి జయభేరి మ్రోగించినాడు స్వతంత్ర మహోత్సాహులై రణ దేవ్ పృథ్విసింగ్‌లే ఖడ్గసహాయమున నే సిరయశోగీతికల విర జిమ్మి జీవన్ముక్తులైనారు. రాణీసంయుక్త రాణీ విమల రణ చండిక రుద్రమాంబలే ఖడ్గబలసంపదకు కేళ్లోడ్చి శత్రునివ హముల చీల్చిచెండాడ జాలినారు. నేడుమనకీ వీరమూర్తులే మాతృపితృ దేవతలు. పూజ్యపాదులగు యీ దేశభక్తుల ఆదేశము తలదాల్చి, బానిస భారత దేశంలో స్వతంత్రమేను

కంచుకోట నిర్మింతముగాక, అభేద్యమైన యీకోట నవభార
తంలో శత్రుదండ యాత్ర సరికట్టగలదు, ఏదేశం కోసం శత్రు
క్రోధాగ్నిలో విధ్వంసమైపోవుటకు సంసిద్ధమైతిమో, ఆదేశం,
ఆ మాతృభూమి, ఆ భారత దేశమే ప్రపంచ శాంతిరాజ్యము
స్థాపింపగలదు. యీ శాంతిరాజ్య స్థాపనా ప్రయత్నములో
అగ్రస్థానం మనకు లభించినది, సోదరీ సోదరీమణులారా తనకు
తాన్నై కోరివరించిన మహాభాగ్యమును ఆహ్వానింతురా ?
జారవిడతురా ? యిది పరీక్షాసమయం కాకలుదీరిన యీ
అగ్నిపరీక్షలో ఫలితా ఫలతములు యోచించి కర్తవ్యము
శోధింపుడు మీపై మోపబడిన యీ మహత్తర కార్యము
నిర్వర్తింపుడు (అంత తెరలో కరతాళధ్వనులమధ్య) మహా
రాణి మహారాణీ యీ పిశాచ ప్రభుత్వానికి తలవొగ్గ లేము
ఆత్మగౌరవ కోస ఆత్మార్పణ చేసుకొందాం (అను కేకలు

రాణి :— (ఆలకించి) ఓ ? నా ప్రియ ప్రజలారా మీ మీ రణసన్నాహ
ములు గావింపుడు (తెరలో ఛత్రపతి శివాజీకీ జే మహారాణీ
లక్ష్మీబాయికీ జే అను కేకలు మహారాణి కరతాళధ్వనుల
మధ్య ఉపన్యాసవేదిక దిగును.)

మోరో:— తల్లీ యీ ప్రజాసూరిణ యుద్ధం తప్పదా ? మనకిట్టి
స్థితిలో సామోపాయమే సర్వశ్రేయము కాదా ?

దులా:—(అపహాస్యముగా) సామోపాయము...సర్వశ్రేయము.

శా॥ చీరెల్విప్పిన దుస్ససేను యుద్ధమున్ । జెండాడు మున్భీముడో
స్సార ప్రజ్ఞన దల్చి రోజుగౌరవ । ఛక్షోణి జల్పన్ దులా
జీరావేయనినిల్చె నేటికిక గా । జీబోముల్ నాడుగ
న్నోరామీరును మీరునాత్మబలసా । క్షోభంబునర్థింతురా

దామో:— (కోపముతో) ముదిమిచేసుది డప్పిన తాతగారికి చక్కని
సమాధాన మిచ్చితివి

మ॥ అరులన్ జెండుటకా ఆజిలో మడయుటో । అర్థించు వీరోత్తముల్
యిరుపక్షంబులకున్ జయంబగుటకే । యీతెందు కాక్షించు నుం

గరముల్ జెట్టినచేత మొట్టవలచుచ౯ । గాకూరకే జిక్కెనే.
ధర్ణిరాజ్య సుఖమ్ములీ ముసలివే । దాంతంబు మన్నింతుమే.

రాణి:- (కోపముతో దామోదరు ఛేయిబట్టుకొని)

ఉ॥ అయ్యవిధాన నిక్కరుణ । నాకయుఁపూజ్యుడు వృద్ధుడైన తా
తయ్యను కోడెచూడుతోలి । తప్పనహింపిచితి యుద్ధభూమి బా
బయ్య నెదిర్చిపోరగల బంటెనడీ మొసలోన నన్నుగ
న్నయ్యవుగా దురాగ్రహము । నందుట దేశహిత ప్రబోధమే

మోరో:- కుమారా దామోదరుపై కోపింపకమ్మా.

సీ। ఎవ్వాని పెదవుల నవ్వువెన్నెల జల్లు
పనవై వనాతల మునిగిమునిగి
ఎవ్వాని చిలుకను క్రవ్వించు జిలిబిలి
పలుకుననా యాత్మ కులికికులికి
ఎవ్వాని కన్నులనెగయు చల్లనిగాలి
విసరుల నామేను ముసిరి ముసిరి
ఎవ్వాని నూనూగులెత్తు మీసల శౌర్య
గరిమ నాకన్నుల పెంచి పెంచి

తే॥గీ॥ ఎవని చేతుల మీదుగా ఇన్నినీళ్లు
విడువగాబడునంచు గంపెడు దురాశ
బ్రతికియున్నాడ నానోము పంటయైన
సిసువు దామోదరుని కంట గసరకమ్మ ॥

దామో:-అవును దేశమెట్లు గొడ్డువోయన నేమి మీకుగావలసినది
సంధి సంభాషణలు దాహిత్రు గాఢాలింగనములు యిందు
మిమ్మననగిన పనియేమి.

సీ॥ ఎప్పుడు ఢిల్లీకోట । నెగురు జాతీయ ప
తాక కీర్తుల తళ । తళలుకొంకె
ఎపుడు నా దేశము । యేను స్వతంత్రుడ
నను స్వజాతీయత । అస్తమించె

ఛత్రపతి శివాజి। ఝుళిపించు కత్తిలో
మందు మాటలు రూపు। మాయలేదు
రసపుత్రవీర క। రాసి తళ తళ
కాంతి వితానంబు కరుగలేదు
విప్లవకారుల। విజయఢంకా ధ్వనుల్
కువలయ స్థలమున। గ్రుంక లేదు
తే॥గీ॥ సమరవిక్రమ భీకర। క్రమ మహోగ్ర
బాహుదండ ప్రతాప దు। ర్వార వైరి
రక్త దాహకులగు మహా। రాష్ట్రజాతి
శౌర్య రేఖాగ్ని లింకను। సమయ లేదు.

భీరుడై జీవించుటకంటె వీరుడై మరణించుట యోధులకు ఘనము గాదా?

మోరో:- అయ్యో నన్ను మీరు విశ్వసించుట లేదా?

ఉ॥ పచ్చని పంటభూమిగల। భారత దేశ మహోదరమ్మునన్
చిచ్చురగుల్చు టొప్పదని। చెప్పితిగాక స్వతంత్ర యోధుగా
జచ్చుటకీ తడెన్న డును। జంకుట లేదు జగంబెరుంగదే
వెచ్చని రక్తముల్ విడచు। వీరుడనో అని డాగుపందనో

రాణి:- పితృదేవ స్వతంత్ర సమరసన్నాహముమాత్రమే తప్పదనుచున్నాముగాని మీ నిశ్చితాభిప్రాయము శంకింపుట లేదు.

మోరో:- మహారాణీ తప్పదా? పరరాజ్యాక్రమణకును స్వదేశ సంరక్షణకును అమాయకప్రజారక్తదాహం తప్పదా? సస్య శ్యామలమైన ఝాన్సీరాజ్యము ఊసరక్షేత్రముగా మార్చుట తప్పదా? సాటి సోదరసంహారమున కంతము లేదా? యిది దైనందిక కృత్యమేనా?

రాణి:- లేదు స్వార్థకుక్షింభరుల పైశాచిక ప్రళయనృత్యం నిశ్శేషమై అంతరించువరకు, మానవసంహారమున కంతము లేదు, స్వలాభాపేక్ష నశించునప్పుడే దేశమునకు సత్యమైనశాంతి నిర్మింపబడగలదు, దైవనిర్ణయము వేరుగానున్న..

మోరో:- దైవము.........నిర్ణయము

ఉ॥ గండరగండలై విజయ । కాంక్షల ప్రాణములొడ్డ సిద్ధమౌ
రెండు బలాలలో గల గ । రీబుల రక్తము ద్రావి ఆజిలో
పిండపుకూడు మెక్కుమసి । పెద్దయెనర్చెనె మాలదైవ మీ
భండనభూమిలో బ్రతుకు । పాపికి స్వర్గము మార్గమిచ్చెనే

బాపు:- ఓ వీరయోధులారా నేటికొల్వుకోటము యుద్ధకూటముగా చేయుచున్నారు.

తే. గీ. సమరమో సంధియో చేయ । జనుట యొప్పు
యిర్వురీ రీతిగా కల । హింపనేల
పరువెరింగినచో నగు । బాటుగాదె
పెదవిదాటిన నదియెల్ల । పృథివిదాటు

దులా:- అవును మాటలకంటె చేతలే మాకాదర్శకము (అనిరాణి వంకదిక్కై) మహారాణీ

ఉ. బిచ్చపుకూడు మెక్కుటకు । ప్రీతిజనించిన పిత్రుదేవులై
మచ్చికబూని సంగరము । మానెదరో ఝాన్సి మహీతలస్థలిన్
కచ్చకుకాలు దువ్వ చిర । కాలవిరోధివి తానశీర్షముల్
పచ్చడి కాయలన్ తరుగు । భాతిని బాకున వండనోతువో

యిది ఆత్మ పరీక్షా సమయము కాదు మహారాణీ అగ్నిపరీక్ష.

మోరో:- (తండ్రివంకదిక్కై) పూజ్యపాదులగు పిత్రుదేవు లెఱుంగని ధర్మమేమి

ఉ. ఏను ప్రజాహితేచ్ఛదని । యింపగ ఝాన్సిరమాల లామకున్
రాణిని పోరొనర్ప ప్రజ । లాతలమోపిన కార్యభారమె
ట్లైనను దీర్పగా పలవ । దానిజమారయ ఝాన్సిరాణియే
మానుష హీనురాలనెడి । మాటయు మీకపకీర్తియే కదా

మోరో:- మహారాణీ నీజన్మ ధన్యము నీ దేశభక్తి వర్ణనాతీతము నీ దృఢసంకల్పము మొక్కవోని వజ్రాయుధము.

దామో:- ఓ భవిషత్ఫల నిర్ణయ స్వప్నజీవి

ఉ. దండిపరాక్రమక్రమ వి । ధాన మహోజ్వల వీర రక్తముల్
పిండివి దేశదాస్య పృథి । వీస్థలి స్వైర విహారవృత్తికై
ఖండన భూమిలో బడిన । భారత దేశము గొడ్డుపోవునే
కండలు బెంచునా తనువు । కాల్పనె దైన్యపు చావు జత్తునే

రాణి:- నాయనా పూజనీయుడగు పితామహునాజ్ఞ యీనాదలి దాల్ప వలయును

దామో:- మహారాణీ యీ విషయములో నీ కెదురాడక తప్పినది కాదమ్మా పుత్రవ్యామోహముచే నా వీరత్వం అడవిగాయు వెన్నెలవలె నిరర్థకమొనర్తువా ?

రాణి:- లేదు తండ్రీ యే ప్రజా భద్రతకొఱకు సర్వసేనానినై రణక్షేత్రమున నడచుచున్నానో ఆ ప్రజా భద్రతకొరకే నీకీ శాసనము విధించుచున్నాను

దామో:- (చకితుడై) శాసనమా ? అమ్మా రాజ... శాసన... మా ? ......

రాణి:- అవును, దేశభక్తియుతుడవగు నీ హృదయగోళమున భగభగమండు విప్లవజ్వాలలు పైకుబుకనీక భూస్థాపితమొనర్చు పైశాచిక రాజశాసనము, సర్వకాల సర్వావస్థల యందును ఖడ్గబలమే జీవనముగాగల వీరబాలుని ఆశాసౌధ విచ్ఛేదమొనర్చు నిర్దాక్షిణ్య రాజశాసనము, స్వాతంత్ర గేయాలతో స్వతంత్ర భావాలతో మాతృభూమినర్చించు దామోదరుపై ప్రయోగించు కఠిన రాజ శాసనము.

దామో:- (యేడ్చుచూ) శిరసావహిస్తానమ్మా రాజశాసనం శిర శిరసావహిస్తాను, నా దేశం, నాజన్మహక్కు, నాకన్నగడ్డకొరకు పోరాడు అదృష్టములేని నిర్భాగ్యుడనగు నేను, రాజశాసనము శిరసావహిస్తాను, కదనరంగములో కరవాలము ధరించి, శత్రు

మస్తక విచ్ఛేద మొనర్ప నోచుకొనలేని దౌర్భాగ్య దామో దరుడనైన నేను రాజశాసనం శిరసావహిస్తాను.

రాణి:—(రామచంద్రరావువంక చూచి) ఆ బాల్యమునుండియు మా సంస్థాన క్షేమము నాకాంక్షించు మీకీ కార్యం భుజస్కంధ ముపై మోపబడినది

రామ:— (యేడ్చుచూ) మహారాణీ మహారాణీ యీపిడుగునాపై కూడా పడినదా? శత్రువును చెండాడే భాగ్యము నాకులేదా?

రాణి:— మహాభాగా దామోదరు సురక్షితస్థానమున భద్రముగా కాపాడుటకు పితృతుల్యులగు మీపై యీ ఆంక్ష తప్పినది కాదు

రామ:— (యేడ్చుచూ) మహాభాగ్యం (అని దామోదరు చేయిపట్టు కొని రా బాబూ అని నడచు చుండును దామోదరుడు తల వంచుకొని తెరలోనికి పోవును)

మహారాణి దులాజీ దులాజీరావు మోరో పంతుపాడుచుం దురు

అనుబంధం

బంధితరా, బంధితరా, భారతదేశం బంధితరా, (బంధి)

రాణి:— రక్తముపిండీ వైరులజెండీ స్వరాజ్యరథమూ లాగండీ చావో బ్రతుకో తేల్చండీ తేల్చండీ, (బంధి)

మోరో:— కరములు తెగనీ శిరములు పోనీ పరాయిపాలన వద్దండీ ప్రాణములర్పణ బలి యీయండీ బలి యీయండీ (బంధి)

దులా:— (ఒరనున్న కత్తిదూసి) కత్తులుదూసీ కండలుగోసీ రక్త భూమిలో నడువండీ స్వేచ్ఛాజీవులు లే లెండీ లేలెండీ (బంధి)

ముగ్గురూకలసి బంధితరా అని పాడుచుందురు. (తెరపడును)

విష్కంభము స్థలము ఝాన్సీకోట వెలుపల దులాజీరావు వొంటరిగా పాడుచూ ప్రవేశం.

(అనుబంధం)

పగసాధించే దులాజీరావూ। మగతనంబునే మరచితివా నీ మగతనంబునే మరచితివా. (పగ)...

ఆశుదానికే అడుగులొత్తి నీ। ఆశయాలు సాధించెదవా. నీ ఆశయాలు సాధించెదవా. (పగ)

బ్రతుకో చావో తేల్చెడి నీవే। పాదుపొట్టకే బ్రతికెదవా. నీ పాదుపొట్టకే బ్రతికెదవా (పగ)

లేదు దులాజీరావూ లేదు, వైరివీరులను చెండాడు యీ ఝాన్సీరాజ్యమున, అబలయు, భర్తృవిహీనయు, అగు ఒక ఆడుది రాజ్యముపాలించు అర్హతలేదు, యీ ధర్మసంస్థాపనము కొరకు సస్యశ్యామలమైన యీ దేశములో విప్లవాగ్నులువుట్టించి, వుబికి పొంగిపొరలే మహాజ్వాలలు, భగభగమండించి, ఝాన్సీరాణి హృదయాశాసౌధం నేలమట్టంగా కూల్పించి, ఆ శ్మశాన భూభాగంలో, కాలిపోయిన బూడిదలకుప్పలపై, వురుమస్వైరవిహారము గావించు వరకు నీ కన్నములేదు. నీరము లేదు. నిద్రలేదు. ఓ వెఱ్ఱిదులాజిరావూ అబలకంటె అధమాధముడవై, మహారాణి పాలనక్రింద, కాదు, కాదు, ఆకుపికాచి అడుగులకు మడుగులొత్తుచు, బ్రతికెదవా? ఆలోచించుకొనుము. నీకర్తవ్యమేమో యిప్పుడాలోచించుకొనుము, ఓయీ అర్థములేని యీ వ్యర్థాలోచనలతో కాలచక్రము గిఱ్ఱున తిరిగిపోవు చున్నది, క్షణము యుగమైపోతుంది, గడచిపోయిన కాలము నీకొరకై కనిపెట్టుకుని కూర్చుండజాలదు, లెమ్ము కార్యశూరుడవుగమ్ము, కర్మవీరుడవై నిమిత్తమాత్రమగు ఆంగ్లేయసహాయ మర్థించి మహారాణీ పశుయజ్ఞము చేయుము. యీ యజ్ఞఫలితమే ఝాన్సీరాజ్య సర్వ సర్వంసహా దేవి ప్రణయసుఖానందము నీ మహదాశయాలు వురుష స్వాతంత్ర్యం, ఝాన్సీరాజ్య పట్టభద్రత్వము, యీ రెండుకార్యములు

ఏకముఖంగా నిన్ను వరించునప్పుడు నీకీ తర్జనభర్జనలతో పనియేమి (సంతోషముతో) మహారాణీ మహారాణీ

మ॥ సిరితాకోరి వరించివచ్చిన దులా । జీరావు మోకాటితో
తిరుగక గాట్టిడి ఖాందసుండగునె యే । దీ మాతమాపైని మ
త్సరవాలో గతి కెవ్వడడ్డుపడి ని । న్గావంగ నే తెంచునో
చిరకాలంబెటు ప్రీతి నేలెదవొ ఝా । న్సీరాజ్య భూభాగముల్

ఓ నెత్తిరాణీ స్వతంత్రసైన్యమను మహానంద తరంగములలో మునిగిపోవుచున్నా వేగాని యీ పారావారకూపగర్భంలో బడబాగ్ని భగ్గునమండిపోగలదని యెరుగలేకపోయినావు. స్వేచ్ఛావిహారియగు దులాజీరావు హృదయమను అగ్నిపర్వతము యెప్పుడు బ్రద్దలై పోవునో భవిష్యన్నిర్ణయమును తేల్చలేకపోయినావు, (అని ఒరనున్న ఖడ్గమునుదూసి కత్తిని చూచుచు)

తే॥గీ॥ రక్తకుండంబులో ఝాన్సి । రాణి శిరము
తూగుటుయ్యాల రీతిగా । నూగునాడె
హృదయభారంబు విడనాడి । నిదురబొమ్మ
ఖడ్గమా వీరభోజ్య మీ । కదనభూమి.

(అని పగసాధించే దులాజీరావూ అను గేయం పాడుకొంటూ తెరలోనికి నిష్క్రమించును.)

రెండవరంగము:- స్థలము ఝాన్సీకోట యుద్ధరంగం తెరయెత్తగా ఫిరంగుల మ్రోత మోరో పంతుకింది పద్యంపాడుచూ ప్రవేశం

ఉ. తెల్లమొగాలతో మడమ । త్రిప్పిన ఆంగ్లసిపాయి మూకల్
డెళ్ళగ వేయుడీ భరత । దేశయశంబు జవంబు నల్దిశల్
జల్లుడి నేటియుద్ధమున । జచ్చుటయో విజయంబు నందుటో
జెల్లును లెండు వైరివధ । జీవనులైన స్వతంత్ర సైనికుల్

(యెదుటచూచి హర్షముతో) ఓ సిగ్గులేని శ్వేతముఖులారా మీకిట్టి శాస్తి కావలసినదే, కాకున్నచో మీపరరాజ్యాక్రమణ దురాశకు హద్దులేదా ? యెంతకాలమీ కపటనాటక పాత్రధారణము

వ్యాపార కై తవముతో యేతెంచిన, మీకీ దేశమున దాక్షిణ్యమున తావొసంగుటే భారతీయుల ప్రథమపాపమైనదా ? అందులకేనా యీ అమాయక జనశవ భక్షణ? యీ నిరాక్షిణ్య పిశాచ నృత్యమున కంతము లేదా? సామ్రాజ్యాభిలాషతో సర్వ సర్వంసహా చక్రమును కొల్లగొట్టుటే సార్వభౌమ లక్షణమా ? యిది రాచనీతిజ్ఞతయా ? పైశాచిక ప్రళయ తాండవమా ?

సీ॥ నీ మొగమ్మున వేడి । నెత్తురు వార్చి
వురికంబముల లెన్ని । శిరములొరగె
నీయుదానక రాచ । నీతికి బలి పెట్టి
కవుల కలాలెన్ని । కాలిపోయె
నీ క్రూర దంష్ట్రల । నిరికి భారతసుత
శూరత్వ మెంతెంత । చూర్ణమయ్యె
నీ చండశాసన । నిష్ఠుర వహ్నిలో
జాతీయ కళలెన్ని । సమసిపోయె

తే॥గీ॥ నీ కఠోరనఖాగ్రాల । నిమ్ముపట్టి
యెంతశాస్త్ర సంపద । లెన్ని రాచ
కీయసద్గ్రంథముల్ మట్టు । మాయమయ్యె
పశుబల విహారి సామ్రాజ్య । వాదమారి.

(అంతే మహారాణీ పాడుచూ ప్రవేశం) ఫిరంగుల మోత,

అనుబంధం

లెండో లెండో

స్వతంత్రభేరీ మ్రోగిందీ । స్వతంత్ర సైన్యం కదలిందీ
స్వతంత్రయుద్ధం వచ్చిందీ । స్వతంత్రభారత్ పిలచిందీ॥ లెండో
వైరివీరుల జెండండీ । వీర క్రమము పిండండీ
స్వారాజ్యము మీ హక్కండీ । ఝాన్సికోటను గావండీ॥ లెండో

మోరో:- జయము జయము మహారాణీ !

రాణి:— యుద్ధరంగమున రోజుదొరగారు బహూకరించిన శ్రీముఖ వృత్తాంతము విన్నారా ?

మోరో:— శ్రీముఖమా ? యేమని ?

రాణి:— యేమున్నది, దివాన్ లక్ష్మణరావు, రామచంద్రరావు, దేశ ముఖు తాంబేలతో, మీరును నేనును, ఆయుధరహితముగా తమ శిబిరమువద్దకేగి ప్రాణభిక్ష వేడిన ...

మోరో:— సరే, అర్థమయినది. కాని నీ ప్రత్యుత్తరమేమి ?

రాణి:— నన్ను మీరు సందేహించుచున్నారా ?

సీ॥ ఏరాణిసంయుక్త । వీరసాధ్వీవృత్తి
కరకునిప్పులలోన । కరగిపోయె
ఏఅహల్యాభాయి । సాయుధోపేతయై
కాలగర్భమ్ములో । రాలిపోయె
ఏరుద్రమాంబ దు । ర్వారస్వతంత్రాజి
మెరపుఖడ్గమ్ముపై । నొరగిపోయె
ఏరణచండిక । స్వారాజ్యసమరాన
చెలగి బూడిదరాశి । గలసిపోయె

తే॥గీ॥ ఏవిమలవీరసాహస । వృత్తిభరత
ఖండఖండాంతరమ్ముల్ల । నిండిపోయె
నమ్మహాసాధ్వుల చెరంగు । కొమ్ములంటి
సమరరంగమ్మునన్ జచ్చు । ఝాన్సిరాణి.

(అంతతెరలో తుపాకులమోత క్రిందిగేయం పాడుకొనుచూ దామోదరరావు వచ్చుచుండును, వెనుక చేయిబట్టుకొని వారించుచూ రామచంద్రరావు ప్రవేశం)

అనుబంధం

కరకు ఖడ్గధారమీ । కంఠములను గోయనా
కనికరింపజూతునా । కాళ్ళుబట్టివేడినా (కర)
పాపభీతినేడుమా । భరతభూమి క్రిందగెలే
పారుబోతులార మీపాపఫలము పండెలే (కర)

రామ :— (వారించుచు) కుమారా మహారాణియాజ్ఞ పాలింపుము జయశ్రీవరింపనున్న ఝాన్సీరాజ్యప్రజల కాపాడుము యీనగాచి నక్కలపాలు జేయకుము

దామో:— (కోపముతో) చాలు నీవింకేమియు చెప్పవలదు

తే॥గీ॥ జయము అపజయమో నేటి । సమ్మరభూమి
చెలగి గొట్టెలవేటాడు । పులివిధాన
తెల్లమొగముల కుత్తుకల్ । ద్రెళ్ళువరకు
దొడరి దామోదరునికత్తి । విడువబోదు

(అని పెనుగులాడుచుండును)

(మహారాణీ మోరోపంతులు పరువెత్తుచు దామోదరువద్దకువత్తురు)

రాణి:— (దామోదరుచేయిపట్టుకొని) యేమినీయాగడము

రామ:— మహారాణీ నిర్దయాత్ములగు ఆంగ్లేయసైన్యము నీటికై వచ్చిన మానవతులపైనను, ఆటపాటలలో నిమగ్నులగు బాలబాలిక ప్రకాండముపైనను, దమననీతి సాగించుచున్నారు, యీవార్త చారులచే యెట్లోయెరింగి కుమార్ దామోదరుడు తోక త్రొక్కినకోడెత్రాచువలె బుసకుట్టుచున్నాడు, నేనెంతవారించినను తనపట్టువీడుటలేదు, సమయమునకు మీరాకమే నామనశ్శాంతికలిగినది,

రాణి:— (దామోదరువంకజూచి) విశ్వాసపాత్రుడగు దేశముఖునాజ్ఞనుల్లంఘించవచ్చునా బాబూ!

దామో:— యేమిశాసనాలమ్మాయివి

ఉ॥ ఆననసీమలేనగవు । లల్లలనాడ ఫిరంగిగుండ్లకున్
చానలుచంటిబిడ్డలును । చచ్చుచునుండ నికృష్టజీవినై
మానముమంటగల్పి గతి । మాలినగడ్డికి నోరుజాపి యీ
బానిసవృత్తిలోబ్రతికి । భారతదేశము నుద్ధరింతునా

యీఘోరాన్యాయము నేసహింపజాలను

(అంత తెరలో ఫిరంగుల మ్రోత నేపథ్యమున) మహారాణీ మహారాణీ, రాజద్రోహకు క్రొత్తసహాయంగా వచ్చిన సైన్యాన్ని నిలువరింపలేక కోటకుపశ్చిమపార్శ్వమున ప్రమాదముసంభవించినది మన సైన్యముపుట్టకొకడై పారుచున్నారు)

రాణీ:— (దామోదరువంకజూచి) మారుమాటాడక సురక్షితస్థానమునకుబొమ్ము (అనిరామచంద్రరావువంకజూచును దేశముఖు దామోదరుచేయిపట్టుకొని తెరలోనికి గొంపోవును)

రాణీ:— (కత్తిదూసి క్రింది గేయము పాడుచుండును)

అనుబంధం

పరిపంథులొచ్చినా । ప్రాణాలుపోయినా । భరతమాతను విడతువా
నీజన్మహక్కుకై పోరాడవా ॥ పరి ॥
భరతపుత్రులకీర్తి బ్రతుకుకటో చచ్చుటో । బవరమునజూపలేరా
నీఖ్యాతిచరితలో జెక్కింపరా ॥ పరి ॥
కుళ్ళిపోయినజాతివీర్యంబుపిలబెట్టి । తెల్లమొగములగోయరా
నీబలము తేజంబుజూపింపరా ॥ పరి ॥

(తెరపడును)

---

మూడవ రంగము – స్థలము : యుద్ధరంగము.

(తెరయెత్తగా టేబుల్ పై బ్రాందిసీసాలు పెట్టబడివుండును, ఫ్యూక్ నిలబడివుండును రెండవవైపునుంచి విశ్వపతి రోజుకొనుచు పరుగెత్తుకొనివచ్చి ఫ్యూక్ కాళ్ళు బట్టుకుని)

విశ్వ:— రోజుదొరా, రోజుదొరా, కొంపమునిగినదిసార్ (అనిఏడ్చుచుండును. ఫ్యూక్ వెల్లకిలపడును. పట్టువిడిపించుకొన నాతడు పెనగులాడుచుండును.)

విశ్వ:— (ఏడుస్తూ) తెల్లోళ్ళు దేవుళ్ళని చెబుతుండేది మాజేజెమ్మ, మీచేతుల్లో జస్తే నాకు మోక్షముంది, కాల్చెయ్యండిసార్ ఆడుదానిచేతిలో చావకముందే కాల్చెయ్యండి (అని వణకుచుండును.)

పూర్ణ:- విశ్వపతీ, విశ్వపతీ, (అని చేయిపట్టుకొనును)

విశ్వ:- (ఏడుస్తూ) రానేవచ్చావటే పాపిష్టిముండా, గొంతూ ... గొంతూ...వూపిరీ...వూపిరీ ..జబ్బుజేసి కొత్తరక్తం పట్టనే లేదు, వెధవరక్తం త్రాగితే గుక్కెడుగాదు,వొదిలిపెట్టమ్మా వొదిలిపెట్టు, యీ పాపిష్టిపుద్యోగంలో నాకేం సుఖం లేక పోయింది, ఐతేయేం బుద్ధిగడ్డితిన్నది.. (అని ఏడ్చుచుండును.)

పూర్ణ:- (వీపుపైకొట్టి లేపుచు) విశ్వపతీ, విశ్వపతీ, నేను......

విశ్వ:- (వణకుచు) ఔనమ్మా నీవే. యీగుక్కెడుప్రాణం దిగమింగటానికే తెంచిన కంకాళరాక్షసివి నీవే, నీకు పుణ్యముంటుంది తల్లీ రక్షించమ్మా, రక్షించు.

(అంత తెరలో ఫిరంగులమోత)

విశ్వ:- (ఉలికిపడి) కాల్చనేకాల్చావటే గయ్యాళిముండా, దోజు దొరా ఆడరాణీజోలికి పోవద్దూఅంటువిన్నావా ? యింత బ్రతుకూ బ్రతికియింటివెనకాలజచ్చినన్నట్లు దొరగారిదగ్గరాలు పొందిననేను తుదకీఆడుదానిచేతిలోచావమని పాపిష్టిజన్మ నా మొఘాన మూడుగీతలుగీశాడుగాబోలు, అయ్యోదొరగారూ నా దిక్కులేనిచావువిని కడుపుతరుక్కుపోయి యెంతగాయేడుస్తావో యీ మురిగిపోయినశవాన్ని యేనుక్కనక్కలుతింటాయో, నీకళ్లెదుటయీగుక్కెడుప్రాణంవదిలి నీచేతిమీదుగా గోరీకట్టించుకుందామనుకున్నాను ఆ ఆశలన్నీనిరాశలైపోయాయి (అనియేడ్చును.)

పూర్ణ:- భయపడకువిశ్వపతీ నేను.........

విశ్వ:- పో రాక్షసీ ప్రాణంపోయేటప్పుడుకూడా పాచిపీనుగలాగా నా వెంటబడ్డావు, అయ్యోవిశ్వపతీ నీకువిశ్వంతోసంబంధం తెగిపోయింది, నీరోజులుబాగావుంటే దొరగారికేఅనుగ్రహంకలిగేది కాలంగానికాలంలోకాలంచేస్తే బ్రహ్మరాక్షసులౌతారని మా అమ్మమ్మచెప్పేది ఆవెడచెప్పినమాట వేదాక్షరమైపోయింది

(అనికన్నులునులు వుకొనుచు యేడ్చుచుండును ఫ్ర్యాక్ లేచి విశ్వపతిని కూర్చుండబెట్టును)

విశ్వ:- (సిఫాయివంక తేరిజూచి) రాస్కెల్ బుద్ధిలేదూ వెధవనాలుగు రాళ్ళు దొరగారిచేతినుండి జేబులోపడేవరకు కళ్ళునెత్తికెక్కేయా? యికజూడునాతడాకా, నీచర్మంచీల్పించకపోతే నా పేరువిశ్వపతి కాదు.

ఫ్ర్యాక్:- యింతకూనాచేసిన అపరాధ మేమూఅని ఆలోచిస్తున్నాను.

విశ్వ:- యింకా బుద్ధిలేకుండా మాట్లాడుతున్నావేం అపరాధమేమూ అంటూ? ఒక్క అపరాధానికేంకగ్నవొచ్చింది, శతాపరాధం యింకానోరెత్తితే సహస్రాపరాధం.

ఫ్ర్యాక్:- (తెల్లబోయి చూచుచుండును)

విశ్వ:- యేంఅల్లాచూస్తావేం (గుడ్లుమిటకరిస్తూ యుద్ధరంగాన్నుంచి వార్తలు తెచ్చిన నేనుభయంచేతనో భక్తిచేతనో రోజుదొరగారనుకొని కాళ్ళుపట్టుకుంటుంటే నేనుఫ్ర్యాక్ ముండాకొడుకును నాకాళ్ళువదలిపెట్టుఅనకపోవటం మొదటిపొరపాటు, నీవెదవ హస్తంనామెడమీదబడితే, రాణినామెడమీదకూరోచ్చనిగుండు ప్రేల్చిందని నేనేడుస్తుంటే, నీ పాపిష్టి పేరు చెప్పకపోవటం రెండవ పొరపాటు, యిల్లాగామూడు, నాలుగు, పది, వందలు, లక్షలు, కోట్లు, వున్నాయిఅంతెందుకు, ఆఖరుక్షణంలోజరిగిందోమో జరిగింది, నాతప్పుక్షమించమని నా కాళ్ళుపట్టుకోకపోవటం అసలుపొరపాటు, అందుచేత నేదొరగారితో చెప్పి నీచర్మం చీల్పిస్తానని ఘోరప్రమాణంచేశాను, యిటుసూర్యుడటుపొడిచినా నాప్రతిజ్ఞకుతిరుగులేదు.

ఫ్ర్యాక్:- (హఠాత్తుగా కాళ్ళుపట్టుకొని) బాబూ మీకుపుణ్యం వుంటుంది, నావుద్యోగంకాస్తావూడగొట్టకండి, పిల్లలుగలవాణ్ణి, దిక్కులేనిపక్షినైపోతాను.

విశ్వ:- (లేవనెత్తుచూ) బుద్ధిమంతుడవుకాబట్టి నీఅజ్ఞానంవెంటనే తెలుసుకున్నావు, లేకపోతే విశ్వపతిదెబ్బంటేయేమిటో,

హిమాలయాగ్రంమీదయెగిరికూర్చుండేది, కాబట్టేదొరగారి రాచకీయచతురత్వం, ఆరణపాండిత్యం, ఆరమయస్ఫూర్తి, ఆవిజ్ఞానత్వం, ఆజయశ్రీకరగ్రహణం......

(అంతరోజుదొరసిగరెట్టుకాలుస్తూ ప్రవేశం విశ్వపతి ఫ్యాన్ శాలగ్యాట్ చేస్తూ చెరియొకవైపునకు వెనుకకునడచుచుందురు, రోజు దొరకుర్చీపై నుపవిష్టుడగును, ఫ్యాన్ బ్రాందీఅందించుచుండును)

రోజు:- (త్రాగుచూ) యేమోయ్, విశ్వపతీ, మాప్రతాపం షేక్స్పియర్‌లాగావర్ణనలు దంచేస్తున్నావ్, సరేకాని నేటియుద్ధంలో జయశ్రీమమ్మల్నే వరించిందికాదూ?

విశ్వ:- అవునవును, లేదులేదు, వుండండినాప్రాణాలింకా కుదుటబడలేదు, యుద్ధమంటేనాహార్టు పగిలిపోయింది, కళ్ళుగిఱ్ఱున తిరిగిపోతున్నాయ్, కాళ్ళుకొంకిపోతున్నాయ్, శరీరంలో అదేదో చలిజ్వరంవచ్చినట్లు, గుబుల్లుగుబుల్లుగా వణుకుపుట్టి పోతుంది.

రోజు:- ఆపవోయ్ వెధవ ఆశుకవిత్వం

విశ్వ:- చిత్తంచిత్తం (అని చేతులునులుముకొనుచు వెనుకకుతగ్గును)

రోజు:- (సేవకుడందించుబీర్‌ద్రావి) విశ్వపతీ నీమైండు కంట్రోల్లో బెట్టుకో దొరగార్నిజయశ్రీకరగ్రహణంచేసిందని చెప్పావ్

విశ్వ:- అవునుసార్ వుదయం పదిగంటలదాకాదొరగారిపేరు సందుగొందుల్లో వాడవాడల్లో పేటపేటల్లో మారుమ్రోగింది సార్ నమ్మండి, యీ మోతకు నా చెవులు గింగురులెత్తాయంటే నమ్మండి, ఫిరంగిగుండ్లవర్షం కురిపిస్తుంటే కోటగజగజలాడిపోయింది మనకువిజయంతప్పదనుకొన్నాను సార్.యేమిలాభం తరువాతకథేఅడ్డంగాతిరిగింది .

రోజు:- ఊఅడ్డంగాతిరిగింది

విశ్వ:- విధి బలీయమైందిసార్ ఒక్కక్షణంలోమహారాణిమనసైన్యం మీదవిరుచుకుపడ్డది యెక్కడజూచినా రాక్షసిలాగాప్రత్యక్ష

మయింది పారిపోయేతన సైన్యాన్ని నిలువరించింది మనఫిరంగి గుండ్లనోళ్లు మూయించింది యింకేముంది చెట్టుకొక్కడూ పుట్టకొక్కడూ. మన సైన్యం పటుగుబారింది, సార్ అప్పుడు నా బ్రతుకేమయిందీ, నూబిలో బడ్డపోతు చందమయింది, అయితే

రోజు:- (కోపముతో) యింతవరకునూ కాసంగతి చెప్పకుండా......

విశ్వ:- 'అవిషయం చెప్పడానికే' బయలుదేరాను, అయితేనా ఆట సాగిందికాదు, నా ప్రయత్నానికి జట్టిగంలో మిడత పోటు తగిలింది కళ్లురిమి కత్తి దూసి మహారాణి నావైపు కేవస్తుంది బాబూ నా ప్రాణాలో ప్రాణంలేదు, శరీరంలో ముచ్చెమటలు పోసింది, తల్లి ... న్యాపాసం బలంవుంది కాబట్టి యెల్లాగో వచ్చాను,

(అంత తెరలో ధ ... శ్రీ వాజీకీ జే మహారాణీ లక్ష్మీబాయికి జే అను కేకలు)

విశ్వ:- (వణకుచూ) అయింది నేననుకొన్నంతపనీ అయిందీ, జరిగిన కధంతా పూసగ్రుచ్చినట్లు చెపుదామనుకొన్నాను, యీ అత్య కాలంలో ఆ ఆశకూడా సంధికొట్టింది, రోజుదొరా నాగతేమి చేస్తారో నా ప్రాణాలెలా కాపాడ్తారో

రోజు:- అబ్బా గోల పెట్టకోయ్ (అని విషాదవదనమున దూరదర్శనీ యంత్రముతో కోటవంక చూచుచుండును)

విశ్వ:- యీ యంత్రాల్తో మంత్రాల్తో చింతకాయలు రాలవ్ సార్ మీరు కోరితేనా కుతో చినసలహా యిస్తాను, యిష్టమైతే ఆచరణలో పెట్టండి, లేకపోతే త్రోసిరాజనండి, సార్ యెత్తండి, గుడారాలెత్తండి, బ్రతికుంటే బలుసాకుతినైనా పగసాధించవచ్చు, యీ గ్రుక్కెడు ప్రాణం పోయిన తర్వాత యెవరిని సాధిస్తాం, యెవరికి బోధిస్తాం,

(అంత దులాజీరావు ప్రవేశం రోజుదొర కరస్పర్శ చేస్తూ కుర్చీ చూపును)

రోజు:- సమయానికి మీరాక మిక్కిలి వుపకారం జరిగింది

దులా:- (కుర్చీపై వుపవిష్టుడై) సమయానికి మీదగ్గనం మహోపకారం సార్ త్వరపడాలి, లేకపోతే ప్రమాదం తధ్యం

రోజు:- ప్రస్తుతం మాకుగత్యంతరం బోధపడ్డంలేదు, కోటవిడిచి యింగ్లీషుసారితగినబలాన్ని సేకరించుకొని రావటంమంచిదని ఆలోచిస్తున్నాం, యేమంటారు

దులా:- (వెక్కిరిస్తున్నట్టు నవ్వుచూ) దొరగారుమిక్కిలి నిస్పృహజెందినట్లున్నారు,

రోజు:- అవును కార్యంతప్పివచ్చిందని ఆలోచిస్తున్నాం,

దులా:- లేదు కార్యకారణము లుమనకుయేకముఖంగా అనుకూలించినవి

రోజు:- (సంతోషముతో) యేమంటున్నారు?

దులా:- ఏమన్నానా

సీ॥ ఏరాణిచండదు | ర్వార ప్రతాపాగ్ని
పురుష పౌరుష స్మృతి | కరగిపోయె
ఏరాణిశాసన | క్రూరపిశాచికి
ఆబాలగోపాల | మడలుచుండె
ఏరాణికన్నుల | నెగయు క్రోధజ్వాల
ఝాన్సిరాజ్య ప్రభల్ | సమసిపోయె
ఏరాణిజీవిత | హిమవన్నగంబులో
వీర శౌర్యమునీరు | గారిపోయె

తే॥గీ॥ ఏమహారాణి స్వైరసం | గ్రామభూమి
పగర వేటాడనిర్భీతి | బాకుదూసె
నామహారాణిసిగవ్రావు | నదరనీక
యెల్లి రేపట నేపట్టి | యీయగలను

రోజు:- గుడ్ మిష్టర్, మీసహాయంవుంటే, మాకాసందేహంలేదు కాని ప్రస్తుతంలో మనసైన్యం ఝాన్సీయుద్ధంలో కూలిపోయింది,

దులా:- సార్ గోటితోబోయేదానికి గొడ్డలియెందుకు వుపాయముచే చక్కబడు కార్యమునకు అపాయకరమగు అస్త్ర శస్త్ర ప్రయోగమెందులకు

విశ్వ:- సార్ నామాటవినండి, యీఅనవసరకాలహరణంతో ......

రోజు:- (అపవారించి) విశ్వపతీ నీపనిమీద నీవువెళ్లవచ్చును

విశ్వ:- చిత్తంచిత్తం (అనిపోవును, ప్ర్యూర్ బీరందించును, రోజుదొర దులాజీరావునకగ్లాసందీయబోవ ద్యులాజీరావు సందేహించుచుండును.)

రోజు:- సందేహించకండి, మనస్నేహాన్నిదృఢంగా బంధించాలంటే యిది మొదట్లోలాంచనమాత్రమే. తర్వాత మావాగ్దానాన్ని అక్షరాలాజరుపుతాం, ఊఁ పుచ్చుకోండి.

దులా :- (త్రాగుచూ) సార్ మీ వాగ్దాన భంగం చేస్తారనే సంకోచంనాకేమీలేదు, మీవుదారస్వభావం నేటిక్రొత్తగాదు ఐతేమనకిప్పుడు నూతనమైనక్లిష్టతరసమస్య ఆవిర్భవించినది, ఝాన్సీకోటరక్షణకై తాంతియాటోపీ, ఝాన్సీరాజ్యసరిహద్దులోనిలచియున్నాడు.

రోజు:- (భయముతో) తాంతియటోపీఅంటే (హిందూగారిబాల్డి అంతేనా ?

దులా:- అవునుఆతడే, గోరుచుట్టుపైరోకటిపోటన్నట్లు తాంతియా నెదుర్కొనవలసివచ్చినచో ప్రమాదమావహిల్లగలదు.

రోజు:- హోప్లెస్. మనప్లానంతా తల్లక్రిందైపోయినది.

దులా:- లేదు, నిరుత్సాహపడకుడు, పదిదినములనుండియు, ప్రయాణ బడలికలోనున్న తాంతియాసైన్యమును, మహారాణీసహాయములభింపకుండునట్లుగా, వేరుచేయండి, యీకార్యంయీరేయియేజరుగవలయును, మరియుగమ్యస్థానంచేరగల్గితిమను వుత్సాహముతో, మైమరచినిద్రించుశత్రుబలమును హఠాత్తుగాముట్టడించినచో మనకువిజయంతథ్యం.

(అంతప్ర్యూర్ అందిచ్చుబీరిద్వరూత్రాగుచూ సిగరేట్లుకాల్చుచుందురు)

రోజు:- మిష్టర్ మీరణవ్యూహకుశలత్వం నన్నువెఱ్ఱివాణ్ణిచేసింది, కాని ......

దులా:- (పొగవిడుస్తూ) ఊఁ చెప్పండి

రోజు:- ఆ మరేమీలేదు, మహారాణీసైన్యాన్నినిల్వరింపలేని మన బలం, తాంతియాసైన్యాన్ని వేట్లాడ్డం, సాధ్యమా అని సం... దే...హి...స్తు...న్నా...ను.

దులా:- మీ సందేహంబలనత్తరమైనదే, కానిఝాన్సీకోటవిధ్వంసన భారం నాతలపై మోపండి, నిమిత్తమాత్రులగు సాయుధసైన్యమును మూడువందలమందిని నా వెంటపంపండి, ఆక్షణమేశత్రు రాజ్యలక్ష్మీకరగ్రహణము రోజుదొరగారికి...

రోజు:- (అపవారించి) పొరబడ్డారు, ఝాన్సీరాజ్యలక్ష్మీకరగ్రహణం దొరగారికికాదు దులాజీరావుగారికి, దానికేంగాని, మరియు మమ్మొక అనుమానంపీడించక విడచిపెట్టింది కాదు.

దులా:- అదేమిసార్ ?

రోజు:- మిష్టర్ కోటముట్టడించిపదిదినములైనప్పటికి నేటియుద్ధంలో తిన్నదెబ్బ మాసైన్యమెన్నడూతినలేదు, కొనప్రాణంతో వున్నమున్నూరుసైనికులతో యీకోట నెట్లాస్వాధీనపరుచుకో గలరాఅనిమాత్రమే

దులా:-(నవ్వుచూ)సార్, దులాజీరావుశక్తిసామర్థ్యములుమీరెరుంగరు

తే॥గీ॥ మరఫిరంగుల శౌర్యంబు। విరచుకోట
చెలగివైరుల శీర్షముల్ । చెండుకోట
సర్వబలసంయుతంబగు। ఝాన్సికోట
గుప్తమార్గంబు నేగుత్త। గొన్నవాడ.

రోజు:- వెరీగుడ్ మీసామర్థ్యంమాకిప్పుడర్థమయింది. (అనిపూర్ణా వంకజూచును, సేవకుడందించుగ్లాసులో బీరిద్దరుత్రాగుచుందురు.)

(తెరపడును)

పొందటిరంగం, తెరయెత్తగాయుద్ధరంగం, దేశభక్తులిద్దరుముగ్గురు మరణించి యుందురు, ఝాన్సీరాణితలకుకట్టుకట్టుకొని పాడుచూ ప్రవేశము

(అనుబంధం)

సిగ్గులేనిభావదాస్య। చిత్తవృత్తినూర్చదా దేశమునకుబరువు గూర్చు। దేహమేలగాల్చనా దేహమేలగాల్చనా. (సిగ్గు)

కన్నగడ్డకుమిలిపోవ కడుపుమంట కేద్చువా కన్నులున్నచో స్వతంత్ర కదనభూమినిల్వరా, కదనభూమినిల్వరా. (సిగ్గు)

(అని ఖడ్గమువంకచూచుచుండును. మోరోపంతుదామోదర రావు రామచంద్రదేశముఖుల ప్రవేశం)

మోరో:—మహారాణీ కార్యభారముస దామోదరుమరచుచున్నావు.

దామో:- (కోపముతో) దేశమిట్టిస్థితిలో మునిగిపోయిననూ, యీ వృద్ధునకు దామోదరుతోడిదేలోకము, యీ దురదృష్ట స్వప్నములే వీరికిసాక్షాత్కారము,

మోరో:—అవునుబాబూ

సీ॥ ఎపుడునానోచిన। తపము ఫలింపగా
గలుగునోయని సదా। కలలుగందు
ఎపుడునా చిన్నారి। యెత్తినకత్తిలో
చిలుకుమంటలు పొంగు। కలలుగందు
ఎపుడుదామోదరు। కృపకుపాత్రునిగాగ
వలచుభాగ్యంబబ్బు। కలలుగందు
ఎపుడునాకన్న బా। బీ ఝాన్సినేతయై
కులుకుల మొలపించు। కలలుగందు

తే॥గీ॥ ఎపుడు దోర్వీర్యబలమత్త।హృదయభూరి
వైరవీగపరితాపకాం।తారసమితి
కఠినదావాగ్నివై పండ।గాల్చునట్లు
గడియగడియకు నాతండ్రి। కలలుగందు.

దామో:- సరే మీభావదాస్యము నాకర్థమయినది. అందుచేతనే

ఉ॥ కత్తికి కత్తిదూసి రణ।కౌశలవృత్తి చరించు రాణికిన్
దత్తసుతుండనై యొడలు। దాచిన దేబెకు రాజ్యభోగముల్
కుత్తుక నంటగట్ట మది। గుల్కెడి తాతకు దగ్గునేర్ప నో
క్కత్తుగ న్యాయశాస్త్రధ్వజ।మెత్తితి నన్నవరెట్లుదూరినన్.

మోరో:- ( దామోదరు కౌగలించుకొని ) నిన్నుజూచి సిగ్గుపడుచున్నాను బాబూ !

తే॥గీ॥ పలుకుపలుకున అమృతంబు। చిలికిపోవు
అడుగడుగునకు శౌర్యంబు। నడుచుచుండు
అన్న నీవంటిపుత్రుని। గన్నకతన
భారతావని యెంతటి। ప్రాజ్ఞురాలో ?

(అంత తెరలో ఫిరంగులమోత, దులాజీరావు క్రిందిపద్యము పాడుచుండును.)

శా॥ ఏదీ మా దొరసాని జూపుడు స్వతం।త్రేచ్ఛారణోన్మాదకో
న్మాదుల్ దేశహితైకదీక్షుసురరం।భాభోగవ్యామోహకుల్
రా దేలా తనకోటగావగ మహా।రాణీకపక్షఖ్యాతియా
గాదా ప్రాణములింతతీపియగునా। ఖడ్గమ్ము బెండయ్యెనా ?

రామ:- మహారాణీ, మహారాణీ. మనకిప్పట్టున ఆత్మరక్షణ ఆవశ్యకము.

రాణి:- ఆవశ్యకమా ? ఆత్మరక్షణ ఆవశ్యకమా ? పశుబలవిహారగర్వోన్మత్తులగు వైరిధాటికోర్వలేక ప్రాణరక్షణకు పాఱిపలాడుటావశ్యకమా ? సామ్రాజ్యకాంక్షాపిశాచ దురాక్రమణకు, ఝాన్సీరాజ్యభూభాగమును బలివెట్టి, నిస్తేజమైన ఆత్మరక్షణ ఆవశ్యకమా ? మాతృదేవివలె, కన్నపుత్రివలె, గారవించి, వైధవ్యదుఃఖార్ణవమున దరిగానరాని నన్ను, మహారాణిగానొనర్చి, నా అడుగుజాడలనడచిన అమాయకప్రజా

సముదాయమును. ఆంగ్లేయక్రూరవ్యాఘ్రములకు బలిపెట్టి, దిక్కులేని శరీరరక్షణ యావశ్యకమా ?

రామ:- మహారాణీ..........

రాణి:- అదిగో ఆ దేశభక్తుడు. తనమేనగారు నెత్తురు టేర్లతో, యీదులాడుచు తుదిక్షణంలో సింహకిశోరమువలె గర్జింపుచున్నాడెందులకు? ఆత్మరక్షణ అనవశ్యకమని యూహింపలేకనా? అదిగో ఆజాతీయవాది విజయలక్ష్యసిద్ధితో ఆయుధ రహితుడై, మారణాస్త్రశస్త్రసంపన్నులగు వైరిమూకలతో ముష్టియుద్ధమునబోరి, నిహతుడగుచున్నాడెందులకు కాయరక్షణకర్తవ్యమని యూహింపలేకనా? అదిగో ఆమరణింప సిద్ధముగానున్న వీరయోధు కుక్షినుండి వెలికివచ్చు పేవుల నొకచేయెత్తుకొని, వేటుదిన్న పులివలె, రణరంగమున గోడించుచున్నాడెందులకు? నిర్భాగ్యప్రాణరక్షణ అవశ్యకమని యూహింపలేకనా? విరిగినకరచరణంబులును, తెగినశిరంబులును, చిల్లులుపడిన వక్షంబులును, ప్రాలిన మేధోమస్తిష్కంబులును. పారెడి రక్తపువెల్లువలును, గల్గి యీసింహపరాక్రము లెందులకిట్లు కొండగుట్టలవలెగూలుచున్నారు?

మోరో:- మహారాణీ, ఆత్మరక్షణతో దేశరక్షణ ఆవశ్యకము, యీ ఝాన్సీరాజ్యరక్షణకైననూ నీవిప్పుడెచ్చట నేని తల దాచుకోవలయును.

రాణి:- తలదాచుకొనుటా?...మహారాణీ, శత్రువులచే...పరాజితయై తలదాచుకొనుటా ?...లేదు, లేదు. రాణి యిట్టి పిరికిపంద గాలేదు. ప్రతికావ్యామోహులగు మీ వాక్యములు మన్నించుటకు నాకధికారములేదు, రాణినామమాత్రరాజ్యాధికారి, గాని ప్రజాపీడితమహాపిశాచికాదు, ప్రజలకును,మహారాణికిని కష్టసుఖములలో వేరుకారాదు, యిది ప్రజారాజ్యముగాని రాక్షసరాజ్యము కాదు, నాకన్నబిడ్డలు దేశముకొరకు తమ ప్రాణములు గడ్డిపోచలవలె విడచి వీరస్వర్గమలంకరింప

వారి అడుగుజాడలలో నడచుభాగ్యము నాకు లేదా ? నాకు కావలసినది వీరస్వర్గము, మృత్యుదేవతను, మహదానందముతో ఆహ్వానించుటే నాకర్తవ్యము. దేశచరిత్రలో రాణి వీరనారి యను యశమార్జించు మహాద్భాగ్యము నోచుకొనలేదా? మీగర్భమునఆడుపుట్టువునై జన్మించిన నాకీసదవకాశము గల్పింపరా?

మోరో :— (యేడ్చుచూ) నాజన్మధన్యం. వీరమరణమునుగోరు వీరమాతనుగన్ననాగర్భము ఫలించినది, ఆత్మాభిమానంతోఆత్మార్పణచేయుచున్న నీఅంతిమవిజయలక్ష్యం ఫలించువరకు, శత్రుబారినుండి తప్పించుకొనవలెనని బోధించుచున్నాను, తాత్కాలికముగా గలుగుపరాజయము నీటిబుగ్గవలె అంతర్ధానము కాకతప్పదు. ప్రజాక్షేమము నాంకాంక్షించి, శత్రుమర్దనకు తుదిప్రయత్నమును బూనుదమనుచున్నాను

రాణి:— యిదియొక వెఱ్ఱికాని శత్రువుతో యేకాకియైపోరిన నిర్భాగ్యురాలును, నిస్సహాయయు అగు యీామె యెచ్చటతలదాచుకొనగలదు? యెవ్వరుఆశ్రయమిత్తురు?

మోరో:— నిరుత్సాహపడకమ్మా, ఆబాల్యమిత్రులగు, పీష్వారావు సాహెబు............

రాణి:— దైవబలసహాయములేనపుడు బాల్యమిత్రులును. గర్భశత్రులగుచుందురు, ఝాన్సీరాజ్యరక్షణకై, ముమ్ముందురణక్షేత్రమున శత్రువునెదుర్కొందునని అభయహస్తమొసంగిన పీష్వామనకెట్టిసహాయమొనర్చెనో, స్వయముగాతిలకించలేదా?

మోరో:— సత్యాసత్యముల నెరుంగనియీాదుస్థితిలో మనమెట్టినిర్ణయమొనరింపరాదు, దేశభక్తుడగు పీష్వావైరి భీకరకాంతారవిదారుడగు, తాంతియా మనకాశ్రయమొసంగకపోరు. మహారాణి సైన్యసమీాకరణకై వలయుధనమును వొంటెలపై దోలించుకొని, వెనుక నేనువత్తును, ముమ్ముందు కుమార్

దామోదరుతో, దేశముఖువెంటగొని తక్షణ మీకోట విడువుము.

(అంత తెరలో ఫిరంగుల మ్రోతనే పద్యమున దులాజీరావు యేదీ మా దొరసాని అనివెనుకటి పద్యంపాడును)'

మోరో:— (దేశముఖువంకదిక్కై) తండ్రీ రామచంద్రరావూ, నా ప్రాణములకు...ప్రాణమైన...(అనియేడ్చుచూ) దిక్కులేని దేశభక్తులనునీవెంట...బంపుచున్నాను.

సీ॥ అఖిలజగం । బేకమై యెత్తివచ్చిన
చెక్కుచెదరని వీర । సింహబలులు
దేశానికై క్షాత్ర । తేజంబు గప్పించి
మరణింపగోరెడి । మానధనులు
యశము మృత్యువో స్వేచ్ఛ । నాలింగన మొసర్ప
బాకుదూసిన దేశ । భక్తియుతులు
అరిభయంకరులగు । ఆంగ్లేయవ్యాదయముల్
వ్రక్కలుసేయు ఫి । రంగిగుండ్లు

తే॥గీ॥ భరతమాతకు మేలిమి । పసిడిపంట
లనఘ మూలవిధాత వ్రా । లునకు లొంగి
నెట్టబడె తల్లిపిల్లలి । వ్పట్టునందు
పొమ్మునీవెంటగొనినేడు । పూజ్యభావ.

రామ:— (దుఃఖముతో) మహారాణీ మహారాణీ......

రాణి:— (దుఃఖముతో) బలవత్తరమైనమీయాజ్ఞ శిరసావహిస్తాను, రణరంగములో మరణమే, శరణ్యమనునాఅంత్యనిర్ణయము మార్చుకొన్నాను, నా దేశరక్షణకు, మరియొకప్రయత్నము దైవనిర్దేశమనుదృఢసంకల్పనయినాను, బలవత్తరమైన విధి ఆదేశమును శిరసావహించుచున్నాను (అని చేతులుజోడించి)

ఉ॥ సాటిజగంబులో రిపుల । శౌర్యమడంచిన ఝాన్సిరాణి హో
రాటముగొడ్డుపోయి పర । రాజులకుగ్ బలివెట్టెనిన్నిసీ

కూటికిగుడ్డకు వరుల । కొంపలకేగెడి ఝాన్సికోట యీ నాటికి తీరిపోయినది । నాకునునీకు ఋణమ్ము౹వయ్యాలై.

(అని దుఃఖించుచున్నా నడచుచుండును)

మోరో:– (దుఃఖించుచూ) మహారాణీ......మ..హా..,రా..ణీ...

రాణి:– (యేడ్చుచూ) పితాజీ.........

మోరో:– కుమార్ దామోదరుడు...త....ల్లీ...దా మో...దరు..డు..

(అని రాణినికౌగలించుకొని ఏడ్చుచుండును మరలమహారాణీ కొంతదూరముసడచివెనుదిరిగివచ్చి తండ్రినికౌగలించుకొని యేడ్చుచుండును) తెరపడును

---

(రెండవరంగం – స్థలము : గ్వాలియర్ కోట తెరయెత్తగా కళి పాడుచుండును.)

అనుబంధము

ఎదురీతా ఎదురీతా ఎదురీతా (యెదురీతా)
రాజపూజిత మహారాజరాజులకు
ధీరచిత్తులగు దేశభక్తులకు (యెదురీతా)
కొమ్ములు దిరిగిన గురుతరకవులకు
సమ్మెలు గట్టిన సంసారులకు (యెదురీతా)
ధర్మమూర్తులగు కర్మయోగులకు
నిర్మలజీవననియమబద్ధులకు (యెదురీతా)

కళి నీపేరు కోటిసూర్యప్రభాభాసమానమైపోయింది, లాంచనంగా మహారాణీగారు, ఘోషాడేరాల్లో కుమిలికుమిలి ఏడుస్తుంటే, గ్వాలియరుసంస్థానచక్రం గిఱునత్రిప్పుతున్నావు. యీచక్రం తోపాటు దేశభక్తు లనుకొనే మహారాజులంగార్ల తెలలో వుండే, సహస్రారచక్రం గిఱునతిరిగిపోతుంది. దేశభక్తులట, దేశమంటే యేమిటో మీానింగుదెలియని వెఱ్ఱివిద్వాంసుల్ని, మహారాజా జియాజీరావుగార్ని కోర్టుకీడ్చించి సాక్ష్యవాఙ్మూ

లం తీసుకొంటే, బండారం కాస్తా బద్దలై పోతుంది. నాగరికతా ప్రపంచంలో అగ్రస్థానం నహించిన, యింగ్లండువాసులైన రోజుదొరగార్ని పల్టీ కొట్టించిన, అపరజూబిలీకన్యకు మహారాజా లెక్కేమిటి? దేశభక్తుల అడ్డుపిటీష నేమిటి?

(అంత వెనుకగావచ్చి జియాజీరావు, కన్నులుమూయును, కళ సంతోషంతో పాడుచుండును.)

అనుబంధం

ఎవరో ఎవరో

ప్రేమసాగరమునీదుచు సతతము॥ ప్రేమజగంబే ప్రేమించేదొర॥ లెవరో పరుగులుపెట్టే భావతరగలో। ప్రణయనౌక నడిపించేనాధులు ॥ఎవరో॥ భావిభారతప్రజలజీవితము । బాగుజేసే ఆదర్శకజీవులు ॥ఎవరో॥

(అంత జియాజీరావు కరస్పర్శచేస్తూ కుర్చీలో కూర్చుండును.)

కళ:- (కుర్చీ దగ్గరకులాక్కొని) పైరుకు టయమయింది, రావుగారు రడీగా వున్నారా?

జియా:- దేవిగారో?

కళ:- ఊ దేవిగారు, యీ బేడ్ హేబిట్ మీ కెన్నిసార్లుచెప్పినా (అని మూతివిరిగించుకొనును)

జియా:- (రెండుచేతులుపట్టుకొని) పొరపడ్డాను, పట్టపురాణినిపిలచే అలవాటుప్రకారం ప్రమాదంసంభవించింది, ప్రధమతప్పిదం మన్నించాలి,

కళ :- యీ నక్కవినయాలు కేమిలెండి అపరజూబిలి అనే నాలుగక్షరాలే కంట్రోల్లో పెట్టలేకపోయారంటే, నమ్మే వెఱ్ఱి స్వభావం నావద్ద లేదు,

(అంతమహారాజా అంతరింగిక కార్యదర్శి ప్రవేశం)

జియా:- విశేషమేమి.

కార్య:- మహారాజా జియాజీరావుగారికి విప్లవకారులు మీకీజాబు నందజేయువలసినదిగా.

జియా:— సారాంశమేమి?

కార్య:— చదువును

(శ్రీ) (శ్రీ) (శ్రీ)

గ్వాలియరు సంస్థానప్రభులగు జయాజీరావు, మహారాజావారి దివ్యసముఖమునకు, దేశభక్తులును, స్వాతంత్ర్యపిపాసహృదయులును, పరదాస్యవిచ్ఛేదనదీక్షా కంకణహస్తులగు, విప్లవయోధులు, పంపుకొను శ్రీముఖము,

ప్రభూ

యేదేశంబాహు వీర్యసంపదయందును శస్త్రాస్త్రనిర్మాణమునందును, అఖండఖ్యాతినార్జించెనో, యేదేశంసస్యశ్యామల మైరత్నగర్భయను బిరుదమార్జించెనో, యేదేశం సమస్త శిల్పకళానైపుణ్యమున పతనముకాని ప్రతిభనార్జించెనో, అట్టిభారతదేశం నిర్వీర్యమై, ధనధాన్యవిహీనమై, కళావిహీనమై, పరులకమ్ముడుపోయినది, పతితమైన భారతదేశకల్యాణముననకే స్వాతంత్ర్య సమరాగ్నిలో మేము మున్ముందు దుముకుచున్నాము, ఆత్మగౌరవంకొరకు, మాప్రాణముల బలిపెట్టుటకు, కృతనిశ్చయులమైయున్నాము, ఖండముగాని మాఆత్మబలం సానలుదీరిన జాతిరత్నమువంటిది. స్వేచ్ఛామరణజీవులే మాయాప్తమిత్రవర్గము, అందుచే వీరయోధులనుమాత్రమే ఆనందముతో ఆహ్వానిస్తున్నాము, మాకు జయాపజయములతో నిమిత్తంలేదు, మాలో చావగా మిగిలిన దేశభక్తుడే వీరభోజ్య మనుభవింపగలడు, మాశరీరములో తుదకొక్క రక్తపుకణముమిగిలినా, రణక్షేత్రములో శత్రువుతో బోరాడుటే మాసంకల్పం, విజయమో వీరమరణమో మా విప్లవసంస్థ లక్ష్యం, మహాప్రభూ, యీలక్ష్యసిద్ధికే మీసహాయమర్థిస్తున్నాము, యిది మా న్యాయమైన కోర్కెగాదా ? పెల్లు రేగిన ప్రజావిప్లవసముద్రమును మీరేల అరికట్ట ప్రయత్నించుచున్నారు ? ధర్మబద్ధమైన మా జన్మహక్కు నేల విధ్వంసమొనర్చుచున్నారు ? సర్వవిద్యాపారంగతులగు మీకీఆంగ్లేయదాస్య వ్యామోహమెందులకు ? తుచ్ఛమైన జీవితంకొరకు హృదయదౌర్బ

ల్యం వహిస్తారా? ప్రభూ మీరిప్పుడు సత్యాసత్యముల నిర్ణయింపలేని స్థితిలోనున్నారు, పొట్టకూటికై మీయండ జేరిన జూబిలీపిశాచిమంత్రులకు మహామంత్రియై, రాణులకు మహారాణియై, గ్వాలియర్ సంస్థాన విధ్వంసమునకు ప్రళయనృత్యం చేస్తున్నది, నేడీ కపటరక్కసి మీ ప్రేమారాధనదైవమై రాజ్యాధికారం నిష్కంటకంగా చలాయిస్తున్నది.

కళ:— అపు వెధవసోది

జియ్యా:— విషయం సంగ్రహింపనిదే వివేకం వ్యగ్ర్యమైపోతుంది.

కళ:— (తలవూపుచూ) సరే నెట్టు.

కార్య:— (చదువుచుండును) హద్దులేని యీ ప్రేమాగ్నిగుండంలో, యెందరు భస్మీపటలమైపోలేదు, మహారాజా ఖీరట్టివారు కారా? స్వాతంత్ర్యకాములగు మమ్ము దోపిడిగాండ్రనియు, హంతకులనియు, ప్రజాపీడకులనియు, రాజద్రోహశాసనము, మాతలపై జట్టి వురికంబముల నెక్కించుచున్నారు, మరఫిరంగులకాల్పించుచున్నారు, సముద్రతరంగములవలె పైకుబుకు ప్రజాస్వేచ్ఛను, పశుబలముతో సాధింపబూనుట, వివేకమా? మీరీవిషయములో దూరదృష్టిచూపలేకపోవుచున్నారు, ప్రజాబలమెరుంగని రాజులు పుట్టికినిస్వర్గమునకును అధఃపతనులగుదు రనుధర్మనిర్ణయము, తామెరుంగనిది కాదు, మా అంత్య నిర్ణయం మీముందు నేడు పెట్టుచున్నాము, ప్రజాపాలకులై ప్రజావిప్లవం బలపరచి, శత్రువును, గ్వాలియరుసంస్థానమునుండి వెడలగొట్టవలయును, అట్లుగాదేని దేశదాస్యవిచ్ఛేదనకై విప్లవయోధులే, ప్రజాప్రభుత్వం స్థాపింపగలరు, భవిష్యన్నిర్ణయభారం మీతలపై మోపుచున్నాము.

ఇట్లు

గ్వాలియరుసంస్థాన ప్రజావిప్లవసంస్థ

కళ:— (పండ్లుకొరుకుచు) కాదు యిది ప్రజావిప్లవసంస్థ కాదు గూండాస్ దేశభక్తి వేషంలో బందిపోట్లుకుతయారైన న్రకాస్సు

కార్య:- మహారాజా తిరుగుసందేశంకొరకు, సాయుధులైనవిప్లవ కారులు, అయిదువందలమూక రాజమహల్ వద్ద వేచియున్నారు

కళ:- ఔను రాతుమెత్తనై తేగుట్టంమూడుకాళ్ళనడవదా ? గ్వాలియరుప్రభుత్వానికీతుంటరిమూకనుఅరికట్టె శక్తిసామర్థ్యాలు గొడ్డుపోయాయా ?

జియా:- సాయుధులైన వి..ప్ల..వ కా..రులు మహామంత్రిదివాకరరావెచ్చట?

కార్య:—మంత్రిదివాకరరావుగారుకళావిహీనుడై పోయినాడు, స్థానికోద్యోగులు ప్రజావిప్లవవాదులవై తన్యము స్వయముగాగాంచి ప్రాణరక్షణకుప్రాకులాడుతున్నారు, రాజాస్థానంజాతీయగీతములతో, ప్రజావిజయసూచక జే జే ధ్వనులతో, మారుమ్రోగిపోతున్నది, సంస్థానసైనికులుసైతం, శత్రుపక్షంలో చేరుచున్నారు.

జియా:—(వణకుచు కళవంకజూచి) యీఅపాయముదాటించేవుపాయమేదైనాబోధిస్తావని ఆశించుచున్నాను, నామమాత్రంగ రాజ్యాధికారినినేనుగాని రాజ్యాంగంనడిపేకర్ణధారివి, నీవే ననిగంపెడాసతోనున్నాను.

కళ:—ఆల్ రైటు తింటెగానిరుచితెలియదు, గ్వాలియరుసంస్థానానికి ఆంగ్లేయప్రభుత్వమెందుకురెసిడెంటునునియమించిందో యిప్పుడైనాబోధపడిందా? మహారాజారక్షణకే తెల్లసైన్యాన్ని యీ సంస్థానంలోపోషింపబడుతుందనే నావాదంలోఅర్థం యీక్షణంలోనైనాగ్రహించారా ? ప్రభుత్వసైనికులకగు ధనవ్యయం సంస్థానాన్నిపీల్చిపిప్పిచేస్తుందనే మీవాదం యిప్పటికైనా విత్ డ్రాచేసుకొంటారా? చెప్పరేం విత్ డ్రాచేసుకుంటారా?

జియా:— ప్రజాబలంలేనిసంస్థానంయెంతకాలంపరసహాయంతో నిలువగలదనిమాత్రమే సందేహిస్తున్నాను కాని......

కళ:—మీ సందేహంలో మీనింగే లేదు, ఎంతకాలమేమిటి, ఆచంద్ర తారార్కం, రవియస్తమించని సామ్రాజ్యాధినాథుక్కృపాకటాక్ష వీక్షణాలు మనపై ప్రసరించినంత కాలం.

జయ:— నీ సుధామధుర వాక్కులలో ఆనందం తాండవిస్తుంది, యీ ఆనందంలో హాలాహలమున్నా, మహదానందంతో స్వీకరించగలను దరిలేని సుఖదుఃఖసాగరంలో యీదులాడేనన్న, యేదో వొక ఒడ్డునకు చేర్చే భారం మాత్రం నీపై మోపబడినది దినదిన గండంగా బ్రతికే నా జీవితానికి నీ అభయాల్యుపదేశం అమృతము వంటిది.

కళ:—దినగండమూ లేదు, యుగగండమూ లేదు, కళాదేవిబొందిలో ప్రాణాలుంటే...

జయ:—నీ ప్రతిభావిశేషం నాకు క్రొత్తగాదు కాని నేనేమిచేసేది, గ్వాలియరు సంస్థానం నేడొక అగ్నిపర్వతమైపోయింది, యీ మహా పర్వతంయొక్క

కుమిలిపోతున్నాను, అందులకు నాందిగా నేటి ఘటన...

కళ:— భయపడకండి, నేటిసంఘటన క్షణంలో మబ్బువిడినట్లు విడిపోగలదు.

జయ:— లేదు యీ సమస్య శోకం గాదు పైపెచ్చు నా మరణచిహ్నమే మోనని భయపడుచున్నాను.

కళ:—మహారాజులంగారు మొండుకట్టెట్లో లేకనిద్రపోతుకంగా...

జయ:— (ఆశ్చర్యముతో) నిద్రపోకమా !

కళ:— కాదా మరి !

జయ:— కావచ్చును కాని.

కళ:— ఊఁ సందేహ మెందుకు చెప్పండి ?

జయ:— కారణాకారణములతో కాలహరణం చేస్తుంటే, ప్రస్తుతోప ద్రవం అధికం కాగలదని మాత్రమే సందేహించుచున్నాను.

కళ:— మరి మీ నిర్ణయమేమో ?

జియా:— అగాధమైనరాచకీయసుడిగుండంలో కొట్టుకుపోయే నన్న పహా
సించుచున్నావా ?

కళ:— సరే (అనిఉత్తరంవ్రాసి) పెట్టండిదీనిమీద సంతకంపెట్టండి

జియా:— (కళవంకచూచుచూ నిర్ఘాంతపోవును)

కళ:— నన్నుమీరుసందేహిస్తున్నారా ?

జియా:— సందేహమా లేదులేదు (అనిచేవ్రాలుపెట్టును)

కళ:— (కార్యదర్శితో) మహారాజావారికి చదివివినిపించండి

కార్య:— చదువును.

విప్లవయోధులారా

దేశక్షేమదృష్టితో, నడపుమీయుద్యమం ఫలవంతముగుగాక, మీకోర్కె-ధర్మబద్ధమైనదని మేముగుర్తించినాము, ప్రజాహితైక కార్యంప్రభువుల కనీసధర్మమని మీకభయహస్త మిచ్చుచున్నాము, ఆత్మగౌరవంకొరకు ఆత్మార్పణచేయుచున్న మీసహజ ప్రతాపం, మేమభినందించుచున్నాము. నాఆత్మగౌరవంకొరకు, నాచేసైన సహా కారంమీకు లభింపగలదని విశ్వసింపగలరని నమ్ముచున్నాము,

గ్వాలియర్ సంస్థానాధిపతి జియాజీరావు

(అనిచదివి కార్యదర్శిపోవును)

జియా:— నాయీకపటనాటకపాత్రకర్థమేమి?

కళ:— అర్థమా విప్లవవాదుల మారణోద్యోగము.

జియా:— యెట్లు?

కళ:— కళ్ళకట్టినట్లుగా గోచరించేకథాభాగానికి నానిర్వచనమేల
యేక్షణమున నీజాబు విప్లవకారులకు అందజేయబడునో,
ఆమరుక్షణమేవారు మిమ్ము విశ్వసింపగలరు,

జియా:— ఔను, గానియీమోసము బయల్పడుచో నాగతియేమి?

కళ:— ఓవెఱ్ఱిప్రభూ, రాజ్యాంగతంత్రములలో యిదియొకభాగమే
కాని మోసమేమున్నది. ప్రజారాజ్యమును పీక మహారాజులగు

మిమ్మల్ని తోసి రాజనిక్రొత్త ప్రభుస్థాపనకు, దోహదమిచ్చే రాష్ట్ర మూలకనుకుంటున్నారా?

జియా:- (తలవంచుకొనియుండును)

కళ:- మౌనమేకలా నిర్ఘాంతపోతున్నారు? కాగలకార్యం గంధర్వులే తీరుస్తారు. వైస్రాయిడల్హౌసీ ప్రభువుగారికి నేటిపరిస్థితుల వివరిస్తూ టెలిగ్రామివ్వండి. నేటినుంచి సైనిక శాసనం అమలు పరచండి విప్లవసంస్థ అక్రమసంస్థగా ప్రకటించండి, దేశభక్తులనే వెఱ్ఱివేషధారుల్ని వెతికి వెతికి కాల్పించండి, టూడేస్‌లో పరిస్థితులన్నీ ప్రశాంతపడగలవు

జియా:- (సంతోషంతో) ఆపత్సములో మునిగిపోనున్న నన్ను తెప్పవలె కాపాడగలిగినందులకు నాజీవితశేషం నీకర్పణచేయుచున్నాను. జూబిలీనా ప్రేమారాధన దైవమని సువర్ణాక్షరాలు పల్లెపల్లెలో శిలావిగ్రహంపై చెక్కిస్తాను,

కళ:- ఆల్‌రైట్ లా అంటేయేమిటో మీకింకు తెలియని యీగ్రుడ్డి ప్రపంచము కళ్ళు తెరిపిస్తాను, కళాదేవి మజా అంటే యేమిటో విప్లవకారులకు విజయఢంకా బజాయించి చవిచూపిస్తాను. మహారాజా జియాజీరావుగారి కష్టసుఖాల్లో భాగస్వామిగా నేను సహకరిస్తాను,

జియా:- త్యాంకూ (అనికరస్పర్శ చేయుచుండ తెరపడును)

మూడవరంగస్థలము కాల్పికోటపీష్వారావుసాహెబు తాంతియాతోపి బాందావాలులు యథాస్థానముల కూర్చుందురు తెరయెత్తబడును

తాంతి:- ప్రభూ ఏమిచెప్పుదును

సీ॥ ఎవ్వానిక్రోధాగ్ని । కింధనప్రాయులై
సూదులుమలమల । మాడిపోయె
ఎవ్వానికత్తిలో । నెగయువైరులనెత్తు
టేల్లభారతభూమి । పొర్లిపోయె

ఎవ్వాని పేర్విన్న | నెల్లవేళలయందు
పగతురప్రక్కలే | బల్లమయ్యె
ఎవ్వానిరణఘోష | లింగ్లండుదొరలకు
తల్లలెత్తరానిసం | తాపమయ్యె

తే॥ గీ॥ ఎవనిస్వేచ్ఛా విహారప్ర | భవము భరత
ఖండఖండాంతరమ్ముల | దండువిడిసె
నట్టి యీతాంతియానేటి | యాలమందు
ననఘ్ప్రతికియు చచ్చిన | అధముడయ్యె

రావు:- పూజ్యభావా? భండనభీములగు మీరేయిట్లధైర్యమువహించుచో............

తాంతి:- లేదు పీష్వాజీ

చం. దురమున వైరివీరతతి | దోర్బలశక్తినెదిర్చి గెల్చుటో
భరతకుల ప్రతిష్టకయి | ప్రాణులనీడుటో చెల్లుగాక దు
ర్భరమయి పండుటాకువలె | రాలుశరీరమునంటి దేబియై
పసువిడుపారుబోతు నిటు | భండన భీముడటన్న నవ్వరే

బాందా:- జనాబ్ ధైర్యమవలంభింపండి. యుద్ధగతి యెట్లు నిర్వీర్యమయ్యె? ఝాన్సీరాణీగతి యేమయ్యెను?

తాంతి:- ఝాన్సీరాణి సేమమారయదగిన పుణ్యముగల్గినచో యింత విచారమే లేదు, కనీసము యుద్ధరంగము జేరగల్గిననూ కొంత మనస్తాపము తీరకపోదు.

బాందా:- హజరత్, మీరాయుద్ధరంగమే చేరలేదా?

తాంతి:- లేదు, నేనాభాగ్యము నోచుకొనలేదు.

రావు:- మరి యీయుద్ధమెచ్చట?

తాంతి:- ప్రభూ, వాయువేగమున మనఫౌజును అయిదుదినములతో ఝాన్సీరాజ్యసరిహద్దుల నిల్పజాలితిని. కొలది విశ్రాంతి సైనికుల కగత్యమనియు, మరియొక్కయామమున నే యుద్ధప్రదేశము చేరగల్గుదుమనియు, భావించి, మనఫౌజును విశ్రమింప

నాజ్ఞాపించితిని. శత్రువెట్లో మాలలసదనము గ్రహించి ఆరేయి మైమరచినిద్రించు యోధుల చుట్టుముట్టెను. పోరు ఘోరాతి ఘోరమయ్యెను. ప్రాణములకు తెగించి మనసైన్యమెంత సమరాంగణమున విజృంభించిననూ, తుదకు మన కపజయము తప్పినదికాదు.

రావు:- పుట్టినదాదినుండి అపజయమెఱుగని వీరశిఖామణులగు మీకు విధి ప్రతికూలుడైనాడు.

శాంతి:- (యేడ్చుచూ) నాయీఅపజయముతో, ఝాన్సీకోట పతనమైనట్లు పిడుగువంటి వార్త నా వీనుల బడినది, మహారాణీ యేమాయెనోఅను విషాదరేఖ నాహృదయగోళము దహించుచున్నది. కాని పీష్వాజీ నేనేమిచేయగల్గుదును, శత్రువిజయ కోలాహలము భూనభోంతరముల మారుమోగుచున్నది, వైరులు నన్ను బంధించుటకును, తమ స్వామిభక్తి ప్రదర్శించుటకును, పరిశీలించి వెదకుచున్నారు. అట్టితరి వైరిబారిపడక ఆత్మరక్షణ ఆవశ్యకమని యూహించితిని.

(అంత తెరలో ప్రభూ, రక్తసిక్తాంగయై దత్తపుత్రుడగు దామోదరునితోడను, నమ్మినబంటగు దేశముఖుతోడను, మహారాణీ మీ దర్శనమునకు వేచియున్నది)

రావు:- (ఆలకించి) యెవరు మహారాణి లక్ష్మీబాయి......

(తెరలో) అవును ప్రభూ.

రావు:- సరే, వారిని తోడ్కొని నిచ్చటికిబంపుము.

శాంతి:-ప్రభూ, మహారాణీ మృత్యుగహ్వరమునుండి బయటపడినది.

(అంత రాణి, దామోదరుడు, దేశముఖులు ప్రవేశం)

రాణి:- లేదు, మృత్యువు నన్నాహ్వానింపలేదు. పారుబోతునయిన నన్ను భక్షింప నిష్టములేక యెందో తొలగిపోయినది.

దామో:- అట్లుకాదు.

ఉ. ఆలముసేయు లేని అధ। మాధము పెద్దయొసర్చి రాజుగా
నేలెడి ఝాన్సిరాజ్యమని। యీయమ తాతియు రామచంద్రు ప
ల్లీలకు దోసిలొగ్గినది శ్రీ। నిజమాడిన నిష్ఠురంబుగా
బోలని సత్యదూరమగు। పొల్లువచించుట రాచపాడియే.

తాంతి:- (నవ్వుచూ) నాయనా,

ఉ. పున్నమనాటిచంద్రుగతి। పొల్చెడి నీరతనాలమోము నీ
కన్నులలోని రాచకళ। గాంచిన యీయమ లేతగుండియల్
వెన్నవలెన్ గరంగినది। వేతనతో జయలక్ష్మి నేడుగా
మున్న మరెన్నడేని తలయూపకపోదు నినున్ వరింపుచున్.

(అని రాణివంకజూచి) మహారాణీ, వీరరసపుత్రుడగు యీ బాలకు సుతునిగా నోముకొన్న నీభాగ్యమే భాగ్యమమ్మా. (అని రక్తసిక్తమగు వదనముగాంచి) అదేమితల్లీ!

రాణి:- ఏమున్నది, ప్రజలకు మాంద్యమై పలాయనము చిత్తగించెడి, అనాథరాణిని బట్టుకొనుటకే తెంచిన లెఫ్టినెంటు బౌకరుదొరగారి, ఖడ్గప్రహారరక్తము.

తాంతి;- కాదు, మాతృదేశముకొరకు, ద్విగుణీకృతోత్సాహముతో శత్రువీరులకు బలియొసంగిన స్వేచ్ఛాజీవితరక్తము, పురుషలోకముచే పూజింపదగిన వీరనారీమణి రక్తము, భావిభారత భాగ్యోదయమునకు కాకలుదీరిన అరుణరక్తము, ఆడుపులివలె గర్జించి బౌకరురాక్షసునకు బుద్ధిచెప్పిన స్వాతంత్ర్యరక్తము, పరదాస్యశృంఖలనిబద్ధ యగు కన్నగడ్డకు స్వాతంత్రభావోదయము ప్రసాదించే పరమపవిత్రరక్తము.

దామో:- అందుచేతనే, యేమరిపాటున బౌకరు తనపై విసరిన ఖడ్గముచే వేటుదిని మాయమ్మ, యొరనున్నఖడ్గము పెరికి, ఆతనిశిర మొక్క వ్రేటునకే, తాళఫలమువలె ఆకసమున కెగురగొట్టినది.

పీష్వా:- మహారాణీ, మంచిపనిచేసితివి.

రాణి:- (ఒరనున్న ఖడ్గమునుతీసి రావుసాహెబుముందుబెట్టి) భర్త మరణానంతరము రాజ్యాధికారము వహింపవలెనని కోరి మీరుచే యొసంగిన ఖడ్గము మీయెదుటబెట్టుటకే వచ్చితిని.

శాంతి:- మహారాణీ, పీష్వాజీ నిందార్హుడుగాడు, ప్రభునాజ్ఞతలదాల్చి ఝాన్సీకోట రక్షింపలేక; ప్రాణభీతిచే పారివచ్చిన యీ శాంతియా...(అని దుఃఖించును)

పీష్వా:- (ఖడ్గము రాణికందించుచూ) విధివశమునమా సైన్యములు నీకు సహాయముగా పంపబడియును ఝాన్సీకోట గావలేక పోయినవి. మహారాణీ, నిరుత్సాహపడకమ్మా, ఝాన్సీరాజ్యము శత్రువిముక్తినందుటకై మాసర్వస్వము నొడ్డగలము. మరియు శత్రువుచేతనూ దూరప్రయాణముననూ, బడలియున్న నీవిశ్రాంతి అవసరమని భావించుచున్నాను. ఆపై సర్వవిషయముల మాట్లాడవచ్చును.

(అంతరాణీ దామోదరదేశముఖులు తెరలోనికేగుదురు.)

శాంతి:- పీష్వాజీ యుద్ధకార్యములతివేగిరమునసంభాళింపనిచో శత్రు ప్రమాదముహెచ్చగలదని తోచుచున్నది.

పీష్వా:- ప్రమాదమా కాల్పికోటకుప్రమాదమా.

పీష్వా:- ప్రియా

చం॥ కరినివధించు సింగమన । గాతమిబొకరు దుష్టశీర్షముల్
తరిగినఝాన్సిరాణి భుజ । దర్పమువైరుల నిద్రబుచ్చునే
దొరకినశత్రురాజ్య రమ । తో గిలిగింతలువెట్టె తుంటి మై
మరచునవైరవృత్తి కొర । మాలుపిశాచముగాదె యేరికిన్.

యేదియెట్లైననూ దేశభక్తిప్రపూతయగు రాణిసాయమత్యావశ్యకము.

పీష్వా:- వృద్ధులగుమీకు మతిపోవుచున్నట్లున్నది, రాజ్యదూరమైన రాణీసహాయము, పీష్వాజీసైన్యమును, బ్రతికింపజాలదు, శత్రుపౌజునునిలువరింపజాలదు.

తాంతి:— ప్రభూ మీకీసందేహమేల ?

సీ॥ తనమహీరాజ్యమం । తయు దేశసేవకే
ధారవోసినవీర । ధర్మమూర్తి
సర్వసర్వంసహా । సంరక్షణార్థమై
కత్తిదూసిన రాజ । కర్మయోగి
భారతావనిదాస్య । బంధమ్ము లను ద్రెంప
శౌర్యమ్ము గప్పు స్వే । చ్ఛావిహారి
సామ్రాజ్యవాద పి । శాచి కుత్తుకగోయ
సమరంబునకు దూకు । ఝాన్సిరాణి

తే॥గీ॥ సహజశౌర్య ప్రతాపాగ్ని । శాత్రవ ప్ర
కరమహారణ్యముల వండ । గాల్చు లక్ష్మి
సర్వసైన్యాధిపత్యయై । శత్రుసింధు
బలము చెలియలికట్టయై । నిలువగలదు

పీష్వా:— (కోపముతో తాంతియావంక జూచును)

తాంతి:— ప్రభూ రోషకషాయతాక్షులైతి రేల ?

పీష్వా:— సర్వసైన్యాధిపతియగు, తాంతియాస్వయముగా స్త్రీసేనా నాయకత్వమంగీకరించుటచేత.

తాంతి:— దక్షులగువారికి స్త్రీపురుషవిభేదమేమి ? పురుషమూర్తియైననూ అధముడైన ఆడుదానికంటె నీచుడుగాడా ?

పీష్వా:— యీసాహసకార్యం ప్రభుమర్యాదకువిరుద్ధం.

తాంతి:— ప్రభువులెల్లపుడును ప్రజాహితకార్యములకే రాజ్యాధికారము వహింతురు.

పీష్వా:— యిది రాజధిక్కారము.

తాంతి:— ప్రభో యీఅపవాదముసహింపజాలను, యేప్రభుమూర్తిని ఆబాల్యమునుండియు, విద్యావినయములబోధించి, మూపులపై నెక్కించుకొని ప్రేమించితినో, యేప్రభు దేవుని, వైరిభీ

కరుడగురణవిద్యాకౌశలుగావించి, ప్రభుభక్తినిర్వహించితినో స్యే ప్రభువసంతునిఆటపాటలనుండియు, నా దేశము, నా జన్మ హక్కును, జాతీయగేయముల, బోధించి, దేశభక్తునిగాజేయ గల్గితిననిపొంగిపోవుచుంటినో, ఆ ప్రభువతంసమును, ధిక్క రింపజాలను, ప్రజాపాలకుడగుపీష్వాకొరకేనాజీవితమంకితమొ నర్చ బద్ధకంకణహస్తుడనై యున్నాను.

పీష్వా:- కావచ్చునుకానిరాచలోకమునకు తలవంపులుదెచ్చే మహా రాణీనాయకత్వము మేమంగీకరింపజాలము.

తాంతి: మహాప్రభూ తలవంపులా ? రాణీనాయకత్వమురాచలోకము నకుతలవంపులా ? పీష్వాజీయీవాక్యమునాహృదయనిర్భేదక ఘోరవజ్రాయుధము, పీడితప్రజానీకకరచరణచ్ఛేదఖడ్గప్రహా రము, నిస్సహాయబానిసజీవశిరఃఖండనపరశు ప్రయోగము, విశ్వమానవకల్యాణకాంక్షాస్వరూపగాఢాంధకారబంధురము సాటినారీలోకస్వేచ్ఛాజీవితయనుపాశబంధము.

పీష్వా:- లేదు, జయాపజయకాంక్షారహితులై, మాతృభూమికొరకు మరణింపసిద్ధముగానున్నవీరపురుషపౌరుషమును గాపాడు నా విద్యుక్తధర్మము, ప్రభుభక్తికొరకు, తమతమజీవితములనంకిత మొనర్చిన. యోధపుంగవులమనోజాడ్యహరణమునకు, మహా మంత్రౌషధము, పశుబలగర్వోన్మత్తులగువైరికుంజరములకు సింహస్వప్నము.

తాంతి:- మహాప్రభూ, దూరదృష్టిలేనిరాజ్యాంగంనిర్వహించుట కష్ట తరమైనది, విజయలక్ష్మీకరగ్రహణోత్సాహులగు మీరు, చేచిక్కినయీసదవకాశమును జారవిడతురా ?

పీష్వా:- అవిశ్వాసపాత్రమైన మీఅభిప్రాయము మన్నించి ప్రజాభి ప్రాయము త్రోసిపుచ్చజాలము

తాంతి:- (దుఃఖముతో) మన్నింపరా? నా వేడికోలు మన్నింపరా?

బాందా:- (పీష్వావంకదిరిగి) హజరత్ వృద్ధుడైన తాంతియా శత్రు వులంటే భయపడిపోతున్నాడు, ఆనిర్వీర్యము కప్పిపుచ్చుకోటా

నికి. ఏవో ధర్మప్రన్నాలు విసురుతున్నాడు, ఈతనిపై మీకు ప్రత్యేకఅభిమానము వుంటేధనకనకములచేగాని వస్తువాహనములచేగాని గౌరవించండి కాని, దేశంకోసం తప్పుత్రోవ తొక్కకండి, మహారాణిఆజ్ఞలను మేముపాలింపలేము, ఈ కార్యభారము మీరువహించకపోతే, ఈ ఉద్యమమునుండి మేము నిష్క్రమించుకొంటాము. (అనిగడ్డము సవరించుకొనుచుండును)

ప్యేపా:- నవాబ్ జీ, తప్పుమార్గము త్రొక్కుటకు మేము అంత వెఱ్ఱివారము కాము. రాజ్యాంగనీతిలో ఆప్తబంధుత్వముగానీ పూజ్యభావముగాని మృగ్యము,

బాందా:- మంచిది ఆమాటమీదే నిలవండి. యింకొక విశేషమేమిటంటే పూజ్యులగు తాంతియా, తోచినకలహ మాత్రము యీయగలవాడేగానివృద్ధదశలో శరీరపాటవంతప్పినఈతనిపై సర్వసైన్యాధిపత్యము, మోపడం, నాకంతయిష్టముగా లేదు,

పీష్వా:- భీమబలులగు తాంత్యాబలమజేయము యీతని విడచి మరియొకని సేనానాధుని చేయుట నేలవిడచిసాముచేయునట్లు కాగలదు.

బాందా:- సరే ఆవిషయములో మీయిష్టమువచ్చినట్లానర్పవచ్చును

పీష్వా:- (తాంత్యావంకచూచి) పూజ్యపాదులు తక్షణము సైన్యాయత్తంచేయగలరు. వేయిమందిసైనికులనుమాత్రం మహారాణీ ఆదీనముక్రింద నుంచగలరు.

తాంతి:- ప్రభునాజ్ఞ శిరసావహిస్తాను. (తెరపడును)

# ఝాన్సీరాణి

## తృతీయాంకము

మొదటిరంగము - స్థలము:- ఝాన్సీపురరాజవీధి, రామారావు, వెంకట్రావు తలకును కాలుచేతులకును కట్లుకట్టి యుండును, (తెరయెత్తబడును)

రామా:- అసలుఎప్పుడైతే యింతపనిజరిగిందో కూతట్రవేటులోనున్న నన్ను కేకపెట్టకూడదటోయ్, ఆ రిజరోడిపని నేనేనుక్కునే వాణ్ణిగా-

వెంక:- యిస్ అబ్బా, (అనిలేచికూర్చుని) నేనేంచేసేదోయ్, వెంకట్రావూ, చూస్తూ చూస్తూ నాంభార్యని అమాంతముగా యెత్తుకుపోతుంటే నక్కపోయినతరువాత బొక్క కొట్టుకున్నట్టు, యేడిస్తే లాభంలేదనుకొన్నాను, కాని నన్నుచావచితకకొట్టి మరీతీసుకపోతాడనుకొన్నానా? నాబ్రతుకిట్లు కాలిపోతుందనుకొన్నానా?

రామా:- యేడవబోకురాబాబూ, యేడవ్వాకు. అసలు అమ్మాయి గతియేమయిందో తెలిసికోవాలిగాని ............

వెంక:- యింకెక్కడమ్మాయీ, యింకెక్కడిలోకం, ఆపాపాత్ముడెప్పుడు నేనులేనప్పుడు దొంగకుక్కలాగా, యింట్లో జొరబడ్డాడో, అప్పుడే ఆవిడప్రాణం పోయియుంటుంది, లేకపోతే యేరోకలిబండతోనో వాడితల పగలగొట్టకబోయేదా? చచ్చిన శవములాగా, వాడిబుజాలమీద యెందుకు పడుకొంటుంది; పిల్లాజల్లాగల యీసంసారాన్ని నట్టేట్లోపుట్టెందుకుముంచుతుంది

రామా:- (ఏడుస్తూ) తల్లీరాణెమ్మా నీచల్లనిపాలనంలో యిలాంటి కౄరకృత్యాలు యెరుగుదుమా అమ్మా, చెట్టుచెడేకాలానికి కుక్కమూతిపిందెలు పుట్టాయి, అన్నట్లు రిజరోళ్ళకి పోయేకాలంవచ్చిందిగామాను, (అనికోపముతో) ఒరిగొడ్డుబోతు

ముండాకొడకా నీకు బిడ్డాపాపాలేరా? నీపెళ్ళాన్ని ఎవడైన పట్టుకొంటే నాలుకపీక్కొనిచావవటరా? ఆసమయంలో నా కంటేబడితే నీతల ఛక్కదెబ్బతో. రామకీర్తనపాడేది (అని కత్తిసవరిస్తూ) అసలు వాడెటుపోయాడో చెప్పు వాడిఅంతు కనుక్కొంటేగాని (అనిలేచును.)

వెంక:- వద్దురాబాబూవద్దు, మనరోజులే బాగావుంటే ఆ రాణీగారే బ్రతికియుండేది, మనకీపాట్లే తప్పిపోయేవి. చచ్చేవాణ్ణి నేను వక్కణ్ణేచావక నీప్రాణాన్ని యెక్కడతీసేది?

రామ:- యేంచస్తే, బ్రతికేం రాజ్యాలు యేలుతావా? యీ తెల్ల పురుగులక్రింద బ్రతికియుండేదానికన్నా చస్తే మేలుగాదూ?

వెంక:- ఊం, మేలు, ఎవరికిగావాలి మేలు, పాపంపుణ్యం విచారించే ప్రభువులే లేకపోయినపుడు, (అని తలపట్టుకొని యిస్ అబ్బా) నాకళ్లు తిరిగిపోతున్నాయి. చూడూ ఆ ఉత్తరంగా చూడూ ఆలుచ్చాకొడుకు యెక్కడైనా అగపడుచున్నాడేమో,

రామా:- (ప్రక్కకుచూస్తూ) వాడేనా, వాడేనా?

(అంత వెనుకకునడుస్తూ విశ్వపతి వద్దూ, వద్దూ, అని కేకలు వేస్తూ రామారావును తాకును)

రామా:-(కోపంతో) వద్దూ, మా లక్ష్మమ్మను బలవంతంగా ఎత్తుక పోయిన నీప్రాణం నిలువునతీయొద్దూ (అని గుద్దును)

విశ్వ:- (వణకుచు) అమ్మా, వద్దు నాప్రాణంతీయొద్దు, బుద్ధిగడ్డిదిని, యీ పాపిష్టివుద్యోగంలో చేరాను.

వెంక:- (కోపంతో) బుద్ధిగడ్డిదినబట్టే ప్రాణానికాశవదులుకోవాలి. (అని నడవబోయి క్రిందపడును)

రామా:- లేవాకురా బాబూ, యీమధవమొగాన్ని చంపటానికి నేంజాలనూ (అని విశ్వపతిగొంతుపట్టుకుని) మాలక్ష్మమ్మ నేం జేశావో చెప్పు, లేకపోతే పీకనొక్కేస్తా.

విశ్వ:—ల...క్ష్మ...మ్మ...బొ...క...రు...దొ...ర...గా...రు
(అని పట్టువిడిపించుకొన ప్రయత్నించును)

రామా:- (జుట్టుపట్టుకుని) ఊఁ, లక్ష్మమ్మ మాలక్ష్మమ్మే చెప్పు, యేం జేశావో చెప్పు. (అని గ్రుద్దును)

విశ్వ:- (ఏడుస్తూ) అమ్మబాబో, నాప్రాణం పోయింది. లక్ష్మమ్మా, బొకరుదొరగార్ని చంపినట్టు నీకత్తితో వొక్కసారిగా నా గొంతుగోయమ్మా, పిడిగుద్దులతో జంపితే నీకేం పుణ్యముం టుంది? గతిమాలినవుద్యోగాని కెన్నడో రాజీనామా యిద్దా మనుకున్నాను. అయితేయేం, నారోజులు బాగాలేవు. యీ దిక్కులేనిచావు చావమని పాపిష్టిబ్రహ్మదేవుడు నానొసట్లో మూడురేఖలా రాశాడు, (అని యేడ్చుచుండును)

రామా:- ఔను, పరస్త్రీలనెత్తుకుపోయే నీవంటి పాపిష్టిముండాకొడు కులకి దిక్కులేనిచావు దేవుడేవ్రాశాడు.

విశ్వ:- (తలపైకెత్తి రామారావునంక తేరిజూచి) మీరెవరుబాబూ? యినుపసుత్తెల్లాగాపడే యీ పిడిగుద్దులు లక్ష్మమ్మవే ననుకు న్నాను, ఆమె నా ప్రాణాలు తీయడానికి, యమదూతల్లాంటి మిమ్మల్ని పంపించిందా ?

రామా:- ఔను, నీప్రాణం తీయడానికి, యమదూతలం మేమేరా, (అని గుద్దును.)

విశ్వ:- ఆ ఆ యమదూతలే? నేననుకున్నంతపనీ అయింది. అప్పుడే నాఆయువు మూడిందటయ్యా? లేదునాయనా, తీరా నలభై యేండ్లైనా నిండలేదు, యింతలో నాఖర్మేందు కిట్లా దేవుడు కాలుస్తాడు, దీనికేదో కారణముండాలి. విషయం తేలిందిలే, లోకంలో యెవడిపాపమో బద్దలైవుంటుంది, సరే నన్ను లంకించుకున్నారు, నామాటల్లో మీకు నమ్మకం లేకపోతే, నాజాతకంరాసిన శాస్త్రిగారు, నూరేండ్లాయుఃప్రమాణమని చెప్పాడు, లోకం తల్లక్రిందైనా, ఆయన మాట జరిగితీర వలసిందే.

వెంక:- (లేచివిశ్వపతిగొంతుపట్టుకుని) నోరుముయ్యి పూర్ణాయుర్దాయుంగలవారికీబుద్ధులుపుట్టవు, (అనిగొంతుపట్టుకుని) చెప్పు నాలక్ష్మమ్మనేంజేశావో చెప్పు ఊ.. చెప్పు (అనిగొంతుపిసుగుచుండును).

విశ్వ:- చెప్తాను చె..పు..తా..ను గొంతు..గొం..తు..గొం..తు...

వెంక:- (పట్టువదలి) చెప్పు, నిజంచెప్పు; లేకపోతే తాటిమట్టలాగా చీల్చేస్తా.

విశ్వ:- (యేడుస్తూ) చెప్తాతా, బాబూ చెపుతా, అసలుమొదట్లో బాకరుదొరగార్తో, లక్ష్మీబాయమ్మ జోలికి రానన్నా, కాళ్ళా యేళ్ళాబడియేడ్చాను, ఐతేయేం, నా గ్రహచారంచాలింది గాదు, దొరగారుబలవంతంగా యీడ్చుకుపోయాడు, యేంజేశేది, రానంటేనావుద్యోగం కాస్తా వూడిపోయేటట్లుంది, వెళ్ళితే లక్ష్మమ్మ బ్రతుకనిచ్చేట్టగుపట్టంలేదు, ముందుజూస్తే నుయ్యి, వెనుకజూస్తే గొయ్యి.

రామా:- యీ వెధవసోదెందుకు, మాలక్ష్మమ్మ సంగతేమి?

విశ్వ:- ఆసంగతే చెప్తున్నా, ఆపైనభగవంతుడేవున్నాడని, దొరగారితో సరేపదండన్నాను, ఆయనగుఱ్ఱంమీదేనన్నెక్కించుకున్నాడు, నమ్మండినమ్మకపోండి, కానినిజంచెపుతున్నా, దొరగారిగుఱ్ఱంభూమిమీద నడుస్తుందో, ఆకాశంమీద నడుస్తుందో నాకుతెలియటంలేదు, కళ్ళుగిఱ్ఱునతిరిగిపోతున్నాయి, ఆపాదమస్తకమువణకిపోతుంది, నోటివెంట మాటరావటము లేదు, యెంతసేపల్లాఆగుఱ్ఱంపోయిందోగాని, నాకళ్ళుతెరచి చూచేసరికి, మహారాణీదొరగారూ, యుద్ధంచేస్తున్నారు. ఆ యుద్ధాన్నిమీకువర్ణించిచెప్పాలంటేనాచేతగాదు ఆమెబుఫ్ఫుయుద్ధం వొక్కమాటలో చెప్పాలంటే నేచూడలేకపోయాను, గుఱ్ఱందిగిచెట్టెక్కేను.

రామా:- ఊ చెట్టెక్కేనంటే గట్టునపడ్డేటననుకున్నావు, నీపొట్ట చీల్చినా పాపముందట్రా, (అనిపొట్టపైగ్రుద్దును)

విశ్వ:- (యేడుస్తూపొట్టబట్టుకొని) అమ్మా అమ్మా నీగర్భానికెంత చిచ్చుపుట్టిందే, మాయదారి విశ్వపతి నీకడుపున పుట్టకపోయినా నీకుగొడ్డుబోతనే అపఖ్యాతివొక్కటే మిగిలేది, అయితేనాకీ యమబాధతప్పేది, పాపిష్టిసంసారంలో డబ్బూదస్కం లేకపోయినా, మనకింటిగేదె వెన్నపూసంతా నాముఖానేధారపోశావు, యిల్లుకదిలితేకరిగిపోతానేమోనని, కడుపులో పెట్టుకు పెంచావు, అచ్చట్లూముచ్చట్లూ అన్నీ తీర్చుకొన్నావు, పెరిగి పెద్దవాణ్ణై నీతలకొరివిపెట్తానని ఆశించావు, నీఆశలన్నీ నిరాశలై పోయాయి అమ్మా అమ్మా ఆఖరునిముషంలో కంటికికడవలుగా యేడ్చేనిన్నూరడించేకర్మం నేనునోచుకోలేదు, నాగ్రహచారంయిల్లాకాలిపోయింది, నీకూనాకూ రుణానుబంధం తెగిపోయింది, అమ్మా యములోళ్లు యములోళ్లు......

వెంక:- యీదొంగయేడుపుకేమిలేవోయ్ లక్ష్మమ్మను పొట్టబెట్టుకొని యీమాయనాటకం ఆడుతున్నావ్, నీపాపం బ్రద్దలయింది, వంటయింటికుందేలులాగా నాకళ్ళబడ్డావు.

విశ్వ:- ఔను నాపాపం బ్రద్దలయింది, కాకపోతే యీకర్మమెందుకు ముంచుకొస్తుంది, వృద్ధాప్యంలోవున్న మాఅమ్మకు, గర్భశోకంతప్పదు, అయితేకేసులోమేలని, నాయదానబడియేడవకుండా, పెండ్లిపెటాకులుకాలేదు, అదికొంతనయం, కాని నా అంత్యకాలంలో నన్ను నమ్ముకొన్న రోజుదొరగారికి, బొకదు దొరగార్ని రాణీలక్ష్మీబాయి యెలాచంపిందీ, చెప్పేదిక్కులేక పోయినందుకేడుస్తున్నాను.

రామా:- ఊహూ యిదొకదగుల్బాజీవేషం, ఆత్మాభిమానం కోసం అగ్నిలోదగ్ధమైన మహారాణీ, నీకెక్కడకనుపించింది, కొబ్బరి చెట్టెందుకెక్కావంటే, దూడమేతకనే మొండిసంభాషణకట్టెయ్యోయ్.

విశ్వ:-(ఆలోచిస్తూ) ఊహూ, అదా సంగతి, మహారాణి చచ్చిపిశాచం కాకపోతే దొరగార్నెలాచంపగలిగేది, నాకొక అనుమానంకూడా

కలుగుతుంది, అనుమానమే గాదు, యదార్థంకూడా అంతే, యీవిషయంబల్ల గ్రుద్దివాదించగలను, అరలువిషయంమీరు యముళ్లోళ్ళు కారు, మహారాణీపిశాచస్వరూపాలు, 'పిశాచాలంటేనా కేమీ. భయంలేదు, మంత్రశాస్త్రంలో నాకాపాటి పాండిత్యంలేకపోలేదు, చూడండినాతడాఖా ఓంహ్రాం హ్రీం హ్రూం హ్రైం హ్రౌం హ్రః. ఆవేశయ ఆవేశయ కురుకురు హుం ఫట్ స్వాహా (అనినాలుకకరచుకొని) పొరబడ్డాను ఆవేశానికి పెట్టాను, మారణహోమమంత్రోచ్చారణతోగాని మీరోగం కుదురదు, ఊఁ పోతారా ? మిమ్మల్ని సీసాలోదింపి పాతిబెట్ట మంటారా ?

వెంక:- (కఱ్ఱరువరిస్తూ) పోతాం, నీబుఱ్ఱపక్క దెబ్బకే రామకీర్తనపాడి పోతాం.

విశ్వ:- యిప్పుడుతూపుల్తో చింతకాయలు రాలవ్, మీదగ్గరకఱ్ఱలుంటే నాదగ్గరపిస్తోలుంది, ఒక్కఅడుగుముందుకు పెట్టారంటే కాలుస్తా (అని జేబులోనున్న పిస్తోలుదీసి) ఊఁ కబడ్దార్ (అనిగురిపెట్టిచూపుచుండును, వెంకట్రావ్ రామారావులు వెనుకకుతగ్గుదురు, విశ్వపతి తెరలోనికి పారిపోవును, రామారావు వెంకట్రావులు వెంబడించుచుందురు.) (తెరపడును)

---

రెండవ రంగం - స్థలము : ఝాన్సీకోటలో ఫ్యాక్ అందించు పానీయము త్రావుచూ రోజాదొర ఉచితాసనాసీనుడై యుండును. తెరయెత్తగా దులాజీరావు యోధవేషముతో ముందునడచుచుండును. వెనుక మోరోపంతు పెడరెక్కలు విరచి కట్టబడి నడచుచుండును.

రోజు:- కమాన్ కమాన్ (అని దులాజీరావునకు కుర్చీ చూపును)

దులా:- (ఆసనాసీనుడై, మోరోపంతువంకచూచి)

ఉ. గాలములోని మీనువలె | కాలము కర్మము తప్పివచ్చి మం
మ్మేలిన రాణికిన్ జనకు | లేవిధి చైదమెదుర్వలేక గా
బోలు దులాజిరావుబల | ముఁ చలముఁ చవిజూచి జిక్కె మీ
కాలము జెల్లె రోజుదొర | గారికి వంగి సలాముగొట్టుమా.

మోరో:- ఓయీ దేశద్రోహీ,

శా. చోరత్వమ్మున ఝాన్సికోటఁజొను టే । శూరత్వమా? జాతికిన్
పేరుం పెంపును మంటఁగల్పి ధరిత్రీద్రోహమే శత్రుసం
హారంబా? గతిమాలి వైరులకు జోహారంట సుక్షాత్రమా?
కూౖరా పిల్లినిసింహమన్న జగముల్ । గొండాడి మన్నించునే.

దులా:- (విసుగబడినవ్వుచూ). మీ క్షాత్రపంతమును మేమెరుంగక
పోలేదు,

చం. గతిచెడి కన్నబిడ్డ యిలు । గాయుచు నాడఁది రచ్చకెక్కటే
హితమని ఝాన్సిరాజ్యమున । కేలికలై తెరచాటునన్ ప్రజా
వితతిని వైరిబారినిడి । విత్తముదోంగిలిపారు చోరభూ
పతులగు మీ పరాక్రమము । బాహుబలంబును నేటి క్రొత్తయే?

రోజు;- మిష్టర్, యీవృద్ధజంబుకానికి చక్కనిసమాధానమిచ్చావు.

దులా;- సార్, సమాధానములతో మనశ్శాంతి కాదు.

ఉ. బీరములాడు నీముసలి । పీఁసగనాలుక చీల్చునాడు ధి
క్కారమదాంధుడీ తులువ । కన్నులపోంగెడి మాంసఖండముల్
ధారుణికాక ఘూకములు । తన్నెడినాడు మనంబుశాంతిచే
కూరెడికంటికిన్ నిదుర । గోరెడిగాక అలంతిగల్గునే

మోరో:- ఓ యీసిగ్గులేనిపందా

తే॥గీ॥ ఇదిగొ నా దేశమునకిచ్చు । హృదయసీమ
ఇదిగొ రిపులకువంపని । ప్రధితశిరము
ఇదిగొ సర్వాంగ భరితమౌ । ముదిమితనువు
ఖలుడ గైకొమ్ము జానెడు । కడుపుకొరకు

దులా:- (కోపముతో) ఓ ముసలిపీనుగా నీప్రాణము లిపుడెవ్వరి
చేతులోనున్నవో యెరుగుదువా?

మోరో:- భగవదధీనమున

దులా:- కాదు దులాజీరావుపిడికిటిలో బంధింపబడియున్నవి

మోరో:- కడుపుమంటను పగులకమ్ముడుపోయిన దులాజీరావు...
పిడికిట... .....

దులా:- (పండ్లుకొరుకుచూ) యిది మరహంకారము.

మోరో:- లేదు న్యాయబద్ధము.

దులా:- ఊ న్యాయబద్ధము న్యాయా న్యాయనిర్ణయహక్కు ఝాన్సీ రాజ్యప్రజలకు గాని నీకు లేదు.

మోరో:- అవును ప్రజాపీడకుడగు నిన్ను శిక్షించుహక్కు ప్రజలదే.

దులా:- ప్రజా...పీడకుడు... యిందులకు నీనాల్క వేయిచీలికలు గావలసియున్నది.

మోరో:- సిద్ధముగానున్నాను.

దులా:- ఓయీ యుక్తాయుక్తవివేక హీనహృదయా; పురుషస్వాతంత్రవిహీనమైన యీ అపర అనుమశయాశంలో; స్వేచ్ఛాప్రవృత్తులకల్పించుట; ప్రజాపీడాకరమా? ప్రజాభీష్టమొసంగని మహారాణిని, కాదు ప్రజారక్తదాహపిశాచిని, పదవీచ్యుతనొనర్చుట. ప్రజాద్రోహమా; వీరసింహావిక్రమదేవ్ గంగాధరాదిభూపతుల భుజపీఠినధిష్ఠించిన ఝాన్సీరాజ్యలక్ష్మిని బందితయైన స్త్రీహస్తములనుండి, విముక్తిచేయుట ప్రజావిరుద్ధమా; కాదు ప్రజాపీడకుడను శబ్దమునకర్థమదిగాదు, దేశరక్షణకును, పరదేశాక్రమణ నరికట్టుటకును, చేజిక్కిన అధికారము దుర్వినియోగమొనర్చ ప్రజావిప్లవమునడంప ప్రయత్నించుట ప్రజాద్రోహము, ఆత్మాభిమానముకొరకు ఆత్మార్పణచేయనున్న వీరపురుషస్వైరవిహారము రాజశాసనరూపమున ఖండించుట ప్రజాద్రోహము,

మోరో:- యీఅపవాదము సహింపరానిది, ప్రజాహితమునకై మాత్రమే రాజ్యాధికారము వహింపగలనని ధృతదీక్షాకంకణహస్తయై దైవముఖమున సప్రమాణమొనర్చిన మహారాణీ- (అంతతెరలో దయ్యాలుదొరా దయ్యాలు అని పర్వెత్తుకొంటూవిశ్వపతి ప్రవేశం)

విశ్వ:- (రోజుదొరకు శాల్యూటుగొట్టి) దయ్యాలు, దొరా దయ్యాలు, వెంటబడ్డాయి బ్రహ్మచారిని, పాపిష్టి గ్రహాలకి, బ్రహ్మచారి మాంసమెంత రుచిగా వుంటుందోనని నా వెంటబడ్డాయి, భూత వైద్యంలో ప్రయోజకుడని ఖ్యాతివహించాను నాచిన్నతనంలో ఆపేరు నేతిబీరకాయలాగా నిస్సారమైపోయింది, మంత్రోచ్చారణ చేశాను, ఊహూ, లాభంలేదు, తంత్రంలేని మంత్రం పారదని తంత్రాలెన్నో పన్నాను, ఊహూ సనేమిరా అందిలాభం లేదని దొరగారు బహూకరించిన పిస్తోలు గురిపెట్టాను, ఐతే కొంచెం వెనక్కితగ్గినట్లే తగ్గి కాలు త్రిప్పానో లేదో కబ్జులు లంకించుకొని నా వెంటబడ్డాయి. సార్, మీపిస్తోలు మీరేవుంచుకోండి, నాకక్కర లేదు, ఒక్కగుండైనా తగలలేదు, అసలు ఖంగుమని మ్రోతే లేదు, యెందుకుబాబూ పీకలోపొడుచుకోవడానికా? (అని రోజుదొరముందు పారవేయును)

రోజు:- (నవ్వుచూ) విశ్వపతీ......

విశ్వ:- అసలునాకీపేరు అచ్చిరాలేదు, యింతమంత్రశాస్త్రగాణ్ణే దయ్యాలు వెంబడించాయంటే లోకానికి రక్షణయేముంది (అని మోరోపంతువంకజూచి) బాబోయనుకొన్నంతపని అయింది, యీపిశాచం యిక్కడకూడా దిగింది.

దులా:- విశ్వపతీనీకేమి మతిపోయెనా? యిక్కడపిశాచాలేమీ లేవు...

విశ్వ:- యెందుకులేవు, యీపెద్దమనిషి యెవరనుకొన్నారు?

దులా:- ఓహో అదా కథ, వీరు మహారాణీజనకులగు మోరోపంతు...

విశ్వ:- యిదంతా మోసం, మా అమ్మమ్మ చెప్పిన విద్యాజ్ఞానం నావద్ద వుంది కాబట్టి కుండబ్రద్దలుకొట్టినట్లు యీరహస్యం ఛేదింపగలిగాను, కనుపించేదంతా సత్యమనుకొనే అమాయకులుగాబట్టే బౌకరు దొరగారు, ప్రాణాలు పోగొట్టుకున్నారు, ఒక్కక్షణంలో నావంతు తప్పింది, కాని నేనుకూడా దొరగారితోపాటు దేవరథం యెక్కేవాణ్ణి, పిశాచాలు యుద్ధాలు చేస్తాయనిగానీ, నిలువునా ప్రాణాలు దీస్తాయనిగానీ...

రోజు:— (వారించి) ఆపువెధవసోది బాకరుదొరమరణించాడా ?

విశ్వ:— సార్ నామాటల్లో మీకు విశ్వాసంలేదు, దొరగార్ని రాణీ రూపంధరించినపిశాచంకత్తితోపొడవటం కళ్లారాచూచాను, దొరకళేబరంక్రిందపడటంకూడాచూచాను, పిశాచబలంకాక పోతేఆడదానికీబలమెక్కడనుంచివస్తుంది, దొరగారితలఒక్క వ్రేటుకేయెలాయెగరగొడుతుంది.

దులా:— సరే మనసైనికులు......

విశ్వ:— యింకెక్కడిసైనికులు, పుట్టకొక్కడై పలాయనమంత్రంపఠించారు, నలుగురుతోపాటునారాయణాఅంటూ నేనుకూడా కాలికిబుద్ధిచెప్పాను, వాయువేగంతో గ్రామంలోవచ్చిపడ్డాను, యిందులో ఒకచిదంబరరహస్యంవున్నది, దయ్యాలుకామరూపులుకాబట్టియిద్దరుపురుషాకారాల్లోప్రత్యక్షం, యీరహస్యం వెంటనేగ్రహించాను, మంత్రోచ్చారణచేశాను, పిస్తోలు గురిపెట్టాను, కానియేంలాభం, నాజపంపారలేదు.

దులా:— (నిస్పృహతో) సార్ చేజిక్కినపిట్టజారిపోయెను.

రోజు:— బాకరుదొరమరణవృత్తాంతముమమ్ముదుఃఖావేశులజేసినది

దులా:— యింతటితోయుద్ధాంతముకాలేదు, మహారాణిగాని దామోదరుడుగానీ, జీవించియున్నంతకాలంఝాన్సీరాజ్యము మన చేతుల్లోమనజాలదు, అందుచేనామెఅన్వేషణ యావశ్యకము, మరియుయీముసలిపీనుగను...

రోజు:— యీవిషయంతర్వాతవిచారింపవచ్చు (అనిప్ల్యాక్ వంకజూచి) ప్రస్తుతమీతని జైల్లోబంధించవలసినదిగా జైలుసూపరింటెండెంటుతో మాఆజ్ఞగా...

ప్ల్యాక్:—(శ్యాల్యూటుచేసి) చిత్తం(అనిమోరోపంతునుగొనిపోవును)

రోజు:—విశ్వపతీ భయావేశుడవైనసీవిశ్రాంతి ఆవశ్యకమనిభావిస్తున్నాము.

విశ్వ:— దొరగారిఆజ్ఞకెదురుజూస్తున్నాను మరినాకింకసెలవా ?

రోజు:- ఊ...(విశ్వపతి పోవును)

దులా:- సార్ బౌకరుదొర, మహారాణీ శౌర్యము అలక్ష్యము జేసినాడు గతించిన కార్యమునకు విచారించుటకంటె మహారాణీ వెంటాడు సైనికుల బంపుట కర్తవ్యం.

రోజు:- యీ ప్రయత్నం విజయవంతమౌతుందని నాకంత విశ్వాసం లేదు.

దులా: అయిన చో మిక్కిలి ప్రమాదం సంభవిల్ల గలదు.

రోజు:- ప్రమాదమా ?

దులా:- ఔను ప్రభూ మహారాణీ కాల్పికేగుచో, పీష్వా రావుసాహెబా మెను రక్షింప స్థిరసంకల్పుడు కాగలడు, అప్పుడు గోటితో పోవు దానికి గొడ్డలి వుపయోగింపవలయును.

(అంతపూర్వాక తిరిగి ప్రవేశించి రోజు దొరకును దులాజీ రావునకును పానీయమందించుచుండును).

రోజు:- హా..హా..హా..పీష్వా రావుసాహెబ్, స్థిరసంకల్పం, దొరగారి బలం మీకింకా తెలియ లేదు.

దులా:- తెలియ కేమిగాని......

రోజు:- యీ విషయంలో మా మాటక బ్జక్ష చెప్పగూడదు.

దులా:- చిత్తం అని తలవంచుకొనిఖన్నుడై యుండును.

రోజు:- మేమెందుకీ విషయంలో మిమ్ము మందలించామంటే, పీష్వా సాహెబ్ మనమార్గానికి కంటక ప్రాయమై తలెత్తాడు, యీ విజయహస్తంతోటే విషవృక్షచ్ఛేదం చేయదలచాం.

దులా:-మంచిది కాని అలసిసొలసియున్న యీ స్వల్ప సైన్యంతో దండయాత్ర......

రోజు:- వెఱ్ఱివాడా, రాజప్రతినిధి డల్హౌసీ ప్రభువుగారు, ముప్ఫై వేల సైన్యం దొరగారికి సహాయంగా పంపిస్తున్నాడు, ఐతే యీ యుద్ధంలో మీ సహాయం.

దులా:- నిరభ్యంతరంగా. కాని...

రోజు:- ఊ సందేహించకండి. చెప్పండి.

దులా:- మరేమియులేదు. మీవాగ్దానాన్ని నెరవేర్చే తరుణమాసన్న మైనదని విజ్ఞప్తిచేయుచున్నాను.

రోజు:- హా-హా-హా-ఆంగ్లప్రభుత్వమువారు యిచ్చిన అభయప్రదాన మెన్నడు మరచిపోరు, కాల్పీ ఆక్రమణానంతరం మీకిచ్చిన వాగ్దానం నెరవేర్పగలరు.

దులా:- (సందేహిస్తూ) కాల్పీఆక్రమణానంతరమా?

రోజు:- అవును. ప్రభుత్వమువారు యుద్ధప్రయత్నంలో తల మున్గి యున్నపుడు మీకోర్కె దీర్పజాలగు.

దులా:- చిత్తం.

(అంత ప్యూర్ బీర్ గ్లాసు లందించుచుండును, యిర్వురూ త్రాగుచుందురు.) (తెరపడును)

---

(మూడవ రంగము - కోంచ్ గ్రామ సమరరంగము, పీష్వారావుసాహెబ్, తాంతియా, బాందానవాబు, దులాజీరావు, యథాస్థానముల గూర్చుందురు. తెర యెత్తబడును.)

పీష్వా:-అందుచేతనే నిస్సారమైన మీసంధివచనముల, త్రోసిరాజను చున్నాము.

దులా:- భీమప్రతాపులగు మీ వీరత్వము నేటిక్రొత్తగాదు. కాని రణవ్యాజమున వృధా జనసంక్షోభము గావింపకుండుట మీ కనీసధర్మముగాదా?

పీష్వా:- కనీసధర్మమా? ఆత్మవంచనకు లోనై బానిసధర్మమనుసరించుట కనీసధర్మమా? నిర్వీర్యమైన భారతజాతినుద్ధరింప దీక్షా కంకణహాస్తయగు, మహారాణిని దేవరకు గొర్రెను బలిపెట్టు కటికికిరాతులవలె,పట్టియిచ్చుట కనీసధర్మమా?మానవత్వము మంటగల్పి ఆంగ్లేయసార్వభౌమాశ్రయమున, యావజ్జీవదాస్యార్ణవమున మగ్గుట, మానవధర్మమా? పతితమైన భారత జాతినుండి, పైకుబుకు విప్లవభావతరంగములలో, నోలలాడు

భాగ్యము నా దేశీయులకులేదా? విధివశమున పరులచే కొల్ల గొట్టబడి, కాలగర్భమున లీనమైపోయిన, నా దేశయశోపుష్ప సౌరభము, ఖండఖండాంతరమ్ముల విరజిమ్ముట, భారతీయ విధ్యుక్తధర్మము కాదా? వీరభోజ్యమైన రాజ్యమున విజయమో మరణమో కౌగలింప స్వాతంత్ర్యపథపురోగాములగు......

దులా:- విజయముమాట దేవుడెరుగును, గాని మరణముమాత్రము నిశ్చయము. మహాభాగా మీకీనిష్కారణప్రజామారణయజ్ఞ కర్మఫలమేమి?

శాంతి:- ఫలమేలేదా?

సీ. నవశక్తిజాతీయ । కవులకలాలలో
పరువులెత్తుచు పొంగి । పారలునాడె
భండనమ్మున దేశ। భక్తుల నెమ్మేన
వీరరక్తము జాలు। వారునాడె
ప్రాణాలకు తెగింపు। బూని భారతజాతి
తుములరణమ్మున । దూకునాడె
జాతీయశక్తులు । సామ్రాజ్యవాదంపు
కుత్తుక మొదలంట । కోయునాడె

తే. గీ. కూలు యోధుల బూడిద । కుప్పలపయి
గర్వమున కంచుకోటలు । గట్టునాడె
కడగి నాచేయు నరయజ్ఞ । కర్మఫలము
తేటతెల్లంబుగా నీకు । తెలియగలదు.

దులా:- మీజాతీయదురభిమానమునకు నవ్వువచ్చుచున్నది.

శాంతి:- ఇది దురభిమానమా?

దులా:- కాదామరి,

ఉ. పిల్లికి గంటగట్టగల । పెద్దెవడీ మొనలోనఖడ్గముల్
బల్లెముద్రిప్పుచో రిపుల । బారుఫిరంగులు నోళ్ళువూయునే

యిల్లలుకంగ పండుగగు। నే నిజమాడిన నిష్ఠురంబుగా
జెల్లునుగాక వైరివధ । జీవనవృత్తినలంతి జేతురే.

శాంతి:- ఓయీ, యదార్థవిజ్ఞానవిహీనా, ఆంగ్లసేవాపరాయణా,
పిల్లికి గంటగట్టగల పెద్దయే నీవు గాన్పింపలేదా ?

ఉ. చచ్చిన దేశభక్తుల స్మ। శానములేనిలయంబుగా బరిక
చిచ్చురగిల్చి శాత్రవుల । జెండుట్టయే పురుషార్థసిద్ధిగా
చచ్చెడినంతవఱ విజయ । సాధనముఱ దిలకించు శాంతియో
వెచ్చనిరక్తబిందువులు । వెల్లువలై ప్రవహింపబొంగెడిక

దులా:- సరే.

చం. కళకళలాడునాంధ్రత । ఖండసుఖమ్ము దలంచియింతగా
చిలుకకుబోధచేయునటు । జెప్పితి బూడిదలో ఘృతంబుచే
చిలికినరీతి మన్నుడులు । జెల్లెతుదిక వచియింపు చేయిచే
కలపెదో వైరివీరులతో । కయ్యమొనర్చువో యేనుబో యెదఱ

బాందా:- హజరత్ మాఅంత్యనిర్ణయం బహుకాలంక్రింద తేల్చి వేశామ్, స్వతంత్రంకోసం, ప్రాణాల్ బలిపెట్టడానికి మేం తయారయ్యాం, శత్రువుల్ని హతంచెయ్యటాని– దృఢసంకల్పం చేశాం,

దులా:- మంచిది నవాబుగారూ

సీ. మేనపొంగులవారు । వీరావేడిరక్తము
కదనభూమిక కాల్వ । గట్టునాడె
దిగ్గజమ్ములవంటి । తెల్లదొరల్ పోర
దేశభక్తులతలల్ । ద్రెళ్ళునాడె
మరతుపాకీగుండ్లు । చెరుగనై మ్మేనిలో
పలలమ్ముగుట్టలై । పడిననాడె
సమరాంగణమ్మున । చచ్చిన యోధుల
తలలురాబందుగుల్ । తన్ను నాడె

తే॥గీ॥ వైరివీరప్రతాప దు। ర్వారవిజయ
దర్పమారణ శస్త్రాస్త్ర। దహనకీల
భూనభంబుళమంటలు। ఘోంగునాడె
చెలిగిమీా పౌరుషంబేమొ। తెలియగలదు

తాంతి:— ఓయీా పరదాస్య పరాయణా

ఉ. కన్నులుకల్గుఅంధుడవు। గావున దేశహితైకభావసం
పన్నతగోడ్డుపోయినది। పాయసమే విషమైనరోగిగా
కన్నకుమారురీతి కృప। గాచెడిరాణికి తల్లిగడ్డకున్
బన్నముగూర్చ దేబెలకు। పౌరుషమూష్టిర మూనపత్వమూ

దులా:— మూపౌరుషస్వేచ్ఛా ప్రవృత్తులు, నేడెల్ల మీాకురుచిచూప గలము, నాహితోపదేశము చెవిటికిశంఖమూదినట్లయ్యెను, నానాపత్రమాతృప్రేమ, నీయొద్దనీళ్ళుగారిపోయెను, జాతినధోద్యోగమువారింప, నాచేసినప్రయత్నమునిష్ఫలమైపోయినది, ఓదేశసేవోన్మత్తవ్యర్థప్రలాపీ, యీావృథాజనక్షయమువారింపవా? సస్యశ్యామలమైనభరతఖండముస్మశానభూభాగముగావింతువా? దురహంకారపూరితమగునీనిర్ణయము నేటిదేశకల్యాణమూ? భావిభారతాదర్శకప్రాయమూ? యీాధర్మనిర్ణయము మెరుంగక......

తాంతి:— ధర్మనిర్ణయమూ? కాదుధర్మవిధ్వంసకరము, శత్రుభయోత్పాతపిశాచాలాపస్వార్థకుక్షింభరవ్యాజప్రహసనము, తుచ్ఛపదవీవ్యామోహాలాలసత్వము, ఓదేశసేవాకపటనాటకపాత్రధారీ, తాంతియాహృదయము అచంచలము, వీనిజీవితము జానిప్రజలకుగీటురాయి,ఖడ్గములచేఛేదించిననూ ఫిరంగులచే కాల్పించిననూ, చలింపనినామహదాశయముదుర్భేద్యమైన వజ్రపంజరము, జయాపజయములుగానీ, చావుబ్రతుకులుగానీ, మేమువాంఛింపలేదు, స్వాతంత్రసమరంలోముందడుగువేయుటే మాకర్తవ్యం, యీామహాయుద్ధమున, విజయములభింపుచో,

వీరభోజ్యమనుభవింపగలము, ఆ దేవ భగవన్నిర్ణయమైనచో, వీర స్వర్గమలంకరింపగలము.

దులా:- (పీష్వావంక దిక్కై) మహాప్రభూ

ఉ॥ సంధియొనర్చుచో భర్తత । సంతతి మేలగునంచు చెప్పు మ
దృంధుర నీతిబోధ చెవి । పారదు సత్యమెరుంగరాని గ
ర్వాంధుడు వృద్ధుడీతడు జ । యాపజయంబుల తెల్ప నీభుజ
స్కంధముమీద మోపితి ప్ర । శాంతమనోగతి నాలకింపుమా.

మరియు, యిందొక చిదంబరరహస్యమున్నది యేమందురా?

ఉ. కక్కినకూటికాసపడు । కర్మకులోపగవారు గావునన్
దక్కవు రాజ్యభోగములు । దక్కగనేరవు ప్రాణమానముల్
రెక్కలులేనిపక్షులవలెన్ గతిలేని యమాయక ప్రజా
దృక్కులజిల్కు తోయముల । దిగ్గడి దిక్కెవడో వచింపుమా.

మీ అంతిమలక్ష్యం, విజయసాధనమున కుపకరింపవలెగాని ఆంగ్లేయబలమలక్ష్యమొనర్చి, స్వజననాశకుడను, అపఖ్యాతికి తావొసంగకుడు, రోజుదొర మీపైకురిపించిన కృపామృత వర్షమును సేకరింపుడు,

బాందా:- మానహీనమగు దొరగారికృపాభిక్షుకులమై జీవించు దుర్గతిమాకుగల్గలేదు, కుటిలరాచనీతితో, విజయగర్వోన్మత్తులగు, శత్రుపౌరుషము మేమెరుంగకపోలేదు, దేశారిష్టకరమైన యీరాయబారం మేమంగీకరింపలేము, ముస్లింజాతి పౌరుషం, బాందా నవాబు ప్రతాపం, మీ దొరగారును, మీరును స్వయంగా చూడగలరు,

దులా:- ఓవెట్టిప్రభూ ?

సీ॥ రోసమ్మునన్ పులి । మీసలనుయ్యాల
లూగిననొకవేళ । నూగవచ్చు
రోషమహాటోప । భీషణాహారినోర్చి
బ్రతికిననొకవేళ । బ్రకుకవచ్చు

ప్రళయకాలోత్క ౖగ । భవుశాసనోదధి
నెదురీత నొక వేళ । నీదవచ్చు,
కసిబూని బుసగొట్టు । కాలాహికోరల
పీకినసొక వేళ । పీకవచ్చు

తే॥గీ॥ కాని ఆంగ్లబలాగ్ని ధి । క్కారభూరి
విజయకాంక్షోత్కట కరాళ । విపులబాహు
బలమదోన్మత్త శాత్రవ । శలభములకు
ధరణిజీవింపజాలిన । తావులేదు

పీష్వా:- (కోపముతో) ప్రభుకార్యనిమగ్నుడవైవచ్చిన నీవైమరచు చున్నావు.

శాంతి:- లేదు ప్రభూ యీతడు ప్రభుకార్యనిమగ్నుడు కాడు, స్వార్ధ శక్తిం భక్షకుడు, రాయబార వ్యాజమున, జాతివిధ్వంస గోముఖ వ్యాఘ్రము, పరదాస్య సిద్ధకంకణహస్తుడగు, యీభయంకరపిశాచిస్వరూపమును, భూస్థాపితమొనర్పకున్నచో, దేశారిష్టము కాదా?

పీష్వా:- మహాభాగాసహనము గోల్పోవుచున్నారు

శాంతి:- యెంతకాల మీసహనం, యెందులకీ ధర్మసిద్ధాంతం, పదవీవ్యామోహాలాలసుడగు యీ ప్రజాద్రోహిని ఖండఖండముగా ఖండించుట భారతీయసాంప్రదాయక విరుద్ధమా? ప్రభూ యీతడు క్షమార్హుడుకాడు.

శా. పాపంబోయిక పుణ్యమో స్వజనులన్ । బాధించుదుష్టాత్ముడీ
పాపిన్ మత్కరవాలభీకర ప్రతా । పస్ఫూర్తి నుగ్గాడిచే
డాపాదించిన దోషకర్మఫల మె । ట్లైనన్ దలన్ దాల్చినా
యాపద్ధర్మమునుద్ధరించెదను వ । త్సాభారతక్షోణిపై

(అనికత్తిదూసినడచుచుండును.)

పీష్వా:- (చేయిబట్టుకొని) పూజ్యభావా, సర్వమెరింగిన మీరేధర్మవిధ్వంసమొనర్తురా? భారతదేశము నీతిబాహ్యమైనదను అప

యశమునకు తావిత్తురా? ప్రభుకార్యాచరణోత్సాహియగు ఝాతని పీచమడంప నేడెల్లిలో మించిన దేమి? సమరాంగణముననే మనకార్యము చక్కబెట్టుకొనగూడదా?

తాంతి:- ప్రభూ! క్రోధావేశుడనగునాలో, రాక్షసత్వమావేశించి, ధర్మజిజ్ఞాస నెఱుంగని మూఢుడనైతిని, మీ ప్రబోధమున జ్ఞానోదయముగల్గినది.

దులా:- సరే పీష్వాజీ,

ఉ. నెత్తుటికూటిలో సుఖము | నీసముఖాన దులాజిరావు మీ
తొత్తువిధానబల్క చెవి | దూరదు మించినదేమిలెందు మా
కత్తులుదూసి శాత్రవుల | కంఠములన్ దెగగోయునప్పుడే
వత్తురుగాక సంధికి న | వాబును మీరునుపోయివచ్చెదన్

పీష్వా:- మంచిది పునర్దర్శనము సమరభూమి లభించుగాక (అని రావుసాహెబు తాంతియా బాందానవాబును దులాజీరావు వెంట నడచుచుందురు తెరపడును)

# ఝాన్సీ రాణి

(చతుర్థాంకము)

మొదటిరంగము:- స్థలము. ఝాన్సీకోటచీకటికొట్టులోబంధింపబడిన మోరో పంతు తెరయెత్తబడును.

మోరో:- (తేలుబాధనభినయించుచూ) అబ్బాయీవృశ్చికబాధ, యెంతహృదయవిదారకమైనది, ఓపాపిష్టివృశ్చికమా, మరణింపసిద్ధముగానున్న నేనునీకేమపరాధమొనర్చితిని? అంధకారబంధురమగుయీచీకటికొట్టులో, ఆహారపానీయములవిసర్జించి కృంగికృశించి, శల్యావశిష్టుడను, యీ ముసలిపండుపై, నీ నిష్కారణక్రోధమేల? దురాశాపూరిత హృదయముతో, గోముఖవ్యాఘ్రవదనముతో, విషపూరితరదనములతో, సాటిదేశీయుడై, తోటినంశీకుడైన, దులాజీరావుచేద్రావగాశేషించినరక్తమును, పీల్చుటకేదృడసంకల్పవైతివా? (అనికొంత తడవాగి) యిదియొకవెఱ్ఱికానిదుష్టులకునేరానేరములంటోబని యేమి? సహజస్వభావక్రౌర్యముజూపురే, వారిఆదర్శకజీవనము, తల్లీ భారతమాతా, నేటికినీగర్భమునయెంతటినికృష్టజీవులగనుచుంటివమ్మా యేనాడుపరదాస్యచిత్తోన్మాదుడు నీగర్భమునజనించెనో, ఆమరుక్షణమేఆఛండాలునేలక్రమందింపలేవు? అమ్మాయిదిధర్మహానియా? పుత్రప్రేమకుతార్కాణమా? యేమోయీప్రేమసిద్ధాంతము నేనంగీకరింపజాలను, యీ మాతృప్రేమయేనిన్నీదుర్గతికిదారితీసినది, నీఅచంచలకరుణాతరంగములుదాస్యపారావారగర్భములో ముంచివేసినది, కాకున్నచో, సర్వసర్వంసహాచక్రరక్షాదక్షులై సర్వలోకవ్యాపితసంతతానంతయశోవిరాజితులై, సమస్తశాస్త్రవాసీకసేవితనిర్మలపవిత్రపాదాంభోజులై, నిర్విక్రమపరాక్రమోపేతులగు, మాతృసేవారాధకులకీగతియేలపట్టవలయును,? యిది

పురాకృతకర్మమా? కాదుమాతృదేవీ, యిదినీస్వయంకృతాపరాధము, యీమూకీభావమేదాస్యభారతప్రజా ప్రళయతాండవచిహ్నం, నీనిష్కారణఅవ్యాజానురాగమే, ఆత్మహత్యాసదృశం.

సీ॥ వరవిక్రమమున సా । గరముద్రవింపించిన
సగరమహీపతిఁ । సాకునాడు
కాళీయఫణిఫణా । గ్రముల నృత్యమొనర్చు
కత్తివేల్పుఁ బొజ్జ । గన్ననాడు
పాతాళగంగలో । బంతినమ్ముల నెత్తు
కవ్వడిక్రొంగురుల్ । దువ్వునాడు
నుగ్గునుగ్గుగ తమ్మి । మొగ్గరముఁ గోయు
వీరాభిమన్యు న । ద్వించునాడు
తే॥గీ॥ విజయఢంకా బజాయించి । విక్రమించి
మించిరసపుత్రజాతి పా । లించునాడు
నీయదృష్టంబునకు నేటి । నీచదశకు
బండలైనను కరుగవా । భరతమాత.

(తలవంచియించుకనిదానించి) ముసలివగ్గైనేటరేపటశిథిలముగానున్ననాయవస్థకేమిగాని, కుమార్ దామోదరు, చుస్థితిదలంచుకొన్నచో, నాగుండెవ్రయ్యలైపోవుచున్నది, యెంతటిచిత్తస్థైర్యమవలంభింపబూనుకొన్ననూ, సాధ్యముకాకున్నది, కుమారానీస్థితిదలంచుకొన్నచో, చిత్తస్థైర్యమ్మొల్లుచిక్కునోయీ

ఉ॥ పున్నమనాటిచంద్రికల । బోలెడినీదరహాస రేఖలఁ
కన్నులగాంచుభాగ్యమిక । గల్గదుగా పరహాలతండ్రి సం
పన్నగృహస్థువై ప్రజల । బాధ్యులుదీర్పగజాలు నీకు నా
యన్న సఖుండు లేక నడ । యారెడి దుర్గతిబట్టెనేటికిఁ.

తండ్రీశత్రుమూకలుఝాన్సీకోటనుముట్టడించినపుడు, యెట్టెననూసంధియొనర్చుటయుచితమనునావచనములకు, దండితా

డితభుజంగమువలెబుసకొట్టి, తాతగారుపిరికిపందలలోఅగ్రగ
ణ్యుడనికొండెమాడినదురభిమానపూరితమగు నావిక్రమము,
మరుగువరచి, నీనగుమోమునుముద్దిడునాటియుదంతేముమరపు
వచ్చునా? నాయనా నీవెంతయభాగ్యుడవైతివో యీ? సర్వ
లక్షణశోభితాంగుడవై, శాత్రవారణ్యకఠోరకుఠారుడవై,
దేశసేవాపరాయణవీశౌకంకణహస్తుడవై, పీడితప్రజాకోటిని
పాలింపదగిననీవు, పరపంచలలోకూటిగుడ్డకల్లాడు, దిక్కులేని
యర్భకుగానొనర్చిన, విధిచైదమునకునాహృదయముబ్రద్దలై
పోవుచున్నది, తండ్రీపగబట్టినశత్రుసర్పద్రష్టుడనైననేను, నీ
కేమిసహాయమొనరింపగలను, నాక్షాత్రధర్మమునశించిపోయి
నది, నాయీబౌతికదేహఋణానుబంధము, నీకును, నాకును,
పటాపంచలై తెగిపోయినది, నేడో రేపో కాటికి కాళ్ళుజాచిన
యీముసలిపీనుగ, నీకేమిసహాయము జేయగలదు, దిక్కులేని
వానికి దేవుడేదిక్కు గావున (యించుక నిదానించి) అయ్యో
యెక్కడిదైవము, యెక్కడిశరణ్యము,

తే. గీ. దుర్జనులగూల్చి సజ్జనస్తోమజగతి
నాదరంచెడి భగవానుడింద్రుకాని
నేతిబీరవిధమ్మన। నీతిదప్పె
సర్వపాపికి దైవమ్మ। సాయపడుట.

(కోపముతో) ఓయీ మాలదైవమా? యుగయుగంబుల ధర్మ
సంస్థాపనార్థమవతరింతువని, చెవులు గింగురుమనునట్లు శాస్త్రములు
ఘోషించుచున్న వే, యిదేనా నీధర్మసంస్థాపన? యిదేనా నీదుష్ట
శిక్షణ, శిష్టరక్షణత్వము? యిదేనా నీఅనంతామేయకరుణాకటాక్ష
వీక్షణప్రసారము? యిదేనా నీభక్తజనపారిజాతసిద్ధహస్తము? ఆపన్న
జనరక్షకుడను బిరుదమునకు నీవనర్హుడవు, నీభక్తపోషకత్వము నిరా
ధారము, నీప్రకృతిడాంబికము, నీశీలము సందేహాస్పదము, మోసము,
మోసము.

సీ. ఆలునిర్వాహకు । రాలటంచు వచించి
దేశ దేశమ్ముల । ద్రిప్పినావు
ప్రేమించి మతిలేని । పెద్దకుమారుని
స్థిరసృష్టికర్తగా । జేసినావు
కూడుగుడ్డకుగాని । కోడలన్ మన్నించి
మించి పూజార్హ గా ।వించినావు
విగతజీవుల నేచు । వియ్యంకు లాలించి
వరధర్మమూర్తిగా । బరపినావు
తే.గీ. నామరూపక్రియాదుల । నాదినుండి
లేని నీవు జగంబు పాలించుచుననుచు
కంకణంబెట్లు నిర్భీతి । గట్టినావు
పూవునకు తావి లేనట్లు । దేవ దేవ.

(యించుక నిదానించి) పరమేశ్వరా, ధర్మరూపివగు నీకర్మము శంకించి, నీయెడ మహాపరాధము చేసినాను. దేవ దేవా, నాయపరాధము మన్నింపుము. ఆదిమధ్యాంతరహితా, నీచర్యలవాఙ్మానసగోచరములు. సృష్టిస్థితిలయాధి నేతా, నీసృష్టినైజస్వభావము, బ్రహ్మేంద్రాది దేవతలకే దురూహ్యము. పురుషోత్తమా, సహస్రాక్షుడవై, సర్వసాక్షివై, సర్వలోకరక్షకుడవై, సర్వజీవకల్యాణధాముడవై, సర్వ సర్వంసహాచక్రము సృష్టింపను, పెంపను, లయింపజేయను, యిచ్ఛామాత్రప్రభుడవై పాలింపుచున్నావు. మహారాజును ఫకీరుగా, బికారిని రాజరాజుగా చేయుచుందువు. ఇది నీచిద్విలాసము. జగన్నాటకసూత్రధారివై, అజ్ఞానభూయిష్ఠులగు జీవరాశిచే ఘటపాత్రలసృజించి నాటకరంగస్థలముపై అభినయింపజేయుచుందువు. నటకుని శృంగార, వీర, కరుణాద్భుత, హాస్యరసాదుల పరికించి, ఆనందించుచుందువు. ఆనందస్వరూపా, దుఃఖావేశమున యొడలెరుంగక ప్రేలిన నాపల్లదముల సైరింపుము.

అనుబంధము

జగదాధారా సాధుపోషణా సర్వసాక్షీ దేవా పరమేశా,
నిగమగోచరా నిశ్చలరూపా ఖగవాహన శంకరభగవాన్ ॥జగ॥
సర్వజీవనాధారుడవగు నీసదమలలీలల నిర్గుణా దరమే
నిర్వికారహర నీరజాక్ష సురగర్వదమన శంకర మురహర హే ॥జగ॥
( తెరపడును. )

---

రెండవరంగం, స్థలము కాల్పీయుద్ధరంగం, ఒంటరిగా బాందానవాబు సైనిక దుస్తులతో ప్రవేశం,

(అంత తెరలో, దులాజీరావు క్రిందిపద్యం పాడుచుండును.)

తే॥గీ॥ ధర్మసంస్థాపకుండు బాం । దానవాబు
విక్రమము కన్నులన్ గాంచు । వేడ్కగల్గె
కానరాదేల స్వాతంత్ర్య ।కదనభూమి
దేశభక్తుల ప్రాణముల్ । తీపియగునె

(అంతవిశ్వపతి ప్రవేశిస్తూ వెనుదిరిగి) రండీ, రండీ, ప్రథమ తాంబూలంనాదే. సాహెబుగారు, కాదుకాదు బాందానవాబుగారు, ఇక్కడేవున్నారు, ప్రాణాల్తోనే బంధించాలి, దొరగారిసత్కారం ముందునాకుదక్కించాలి, తర్వాత పేచీబెట్టే లాభంలేదు, నవాబు గార్ని తొలిగాచూచిందినేను, కాబట్టియీవిజయంగానీ, ప్రభుత్వం వారి బహుమానంగానీ, నాకుదక్కాలంటున్నాను, ఊరండీ పెండ్లి నడకల్తోకార్యంసాధ్యంకాదు, చేజిక్కినపిట్ట పారిపోయిందంటే, దొర గారితో స్వయంగాచెప్పి మీచర్మంచీల్పిస్తా, ఊఁ పరుగెత్తండి, దేబె మొఖాలేసుకొని, కదలరేం, సైనికులంతా ఒక్కొక్కతాడుమీదుగా నడవాలి, చొక్కమ్మడిగా చుట్టుముట్టాలి,

(అంత తెరలో ఫిరంగులమ్రోత బాందానవాబు అదరిపడి తెర వంకజూచి భయవిహ్వలుడై పారిపోవును.)

విశ్వ:- ( తెరవంకచూస్తూ) చవటదద్దమ్మలు, గొంతుచినిగేటట్టుగోల పెట్టినా సమయానికి రాలేకపోయారు, నేననుకొన్నంతపనీ

అయింది, పొరపడ్డాను వచ్చేబహుమానం, వదలిపెట్టుకోడానికి నేనేం వెఱ్ఱివాణ్ణికాదు, చూస్తా నవాబుగారెక్కడికిపోతారో చూస్తా, పారిపోతే విశ్వపతివదలిపెట్టాడను కొంటున్నారు, నవాబుగారు, స్వర్గమర్త్యపాతాళలోకంలో యెక్కడడాగినా త్రాచుపాములాగా, కనిపట్టికాటేస్తా,

(అంత తెరలోనుండి) రక్తసిక్తాంగుడై శాంతియూ క్రిందిపద్యం పాడుచూ ప్రవేశం)

మ. ఇదిగో దేశము దేశమోయనుస్వతం। త్రేచ్ఛన్ దివారాత్రముల్
మదమాతంగ వితానముల్ బొదువు హా । ర్యక్షుంబుచందంబునన్
కదనంబందున వైరివీరులతలల్। ఖండింప నేతెంచెడిన్
తుదిమీ ప్రాణములున్న యంతవరకున్ । దున్మాడుడాంగ్లేయులన్

(విశ్వపతివణకుచుండును) అంతమహారాణి రెండవవైపునుండి రక్తసిక్తాంగియై పాడుచూ ప్రవేశం.

అనుబంధం

పరులమొంగిలికూడు భక్షించిగర్వించు షంతకీ నిలునిలువురా నీతలన్
ఖండింప కేవిడువరా (పరు)
కన్నగడ్డకు దాస్యకర్మంబు నీవంటి । ఖలులచే కల్గినదిరా క్రూరుడ:
కదనభూమిన్ నిల్వరా (పరు)

విశ్వ:- చచ్చాను దేవుడో (అని తెరలోనికి పారిపోవును.)

( అంత తెరలో ) నవాబు సైన్యం బ్రిటీషుసైన్యంలో కలసి పోయిందంటే, లాభంలేదు, పరుగెత్తేనవాబుగారినిపట్టుకోండి, ప్రథమ బహుమానంమాత్రంనాదే.

రాణి:- (ఆలకించి) మహాభాగా, వైరిబారిబడనున్న బాందానవాబు, రక్షణయావశ్యకము.

శాంతి:- అవును ఆతనిరక్షణ ఆవశ్యకమే.

(అనిబరనున్న కత్తులుదూసియిర్వురూనడచుచుందురు.)

( తెరపడును)

విష్కంభము, స్థలము, మహారణ్యము, మహారాణీ, దామోదరరామచంద్ర రావు, పీష్వారావుసాహెబు, తాంతియాటోపి దాసవాలు, క్రిందిగేయంపాడుకొనుచూ, ప్రవేశం.

## అనుబంధం

### దేవాదీ దేవా

జగదాధారా। సాధుపోషణా (దేవా)

తల్లిగడ్డచిరదాస్యము రోసీ। దాసులపై దయలేదా. కరుణాళో కృపలేదా-లేదా కృపలేదా. (దేవా)

భగభగమండే విప్లవాగ్నిలో। పరుగిడుభాగ్యము లేదా. దీనులపై దయలేదా లేదా దయలేదా (దేవా)

(అందరూనిద్ధులెకొంతతడవు నిలబడియుందురు)

రాణి:- పీష్వాజీ. దుఃఖభారమున కార్యభారము, మరచుచున్నారు.

పీష్వా:- లేదు, మహారాణీ, దైవనిర్ణయము వేరుగానున్న, యీ కాని కాలంలో, మహారాజాజియాజీరావు, గ్వాలియర్ కోటలో, ఆశ్రయ మొసగుననను, ఆశయూఅంతరించుచున్నది.

రాణి:- సందేహింపకుడు, దేశక్షేమదృష్టితోగాకున్ననూ, మీచే దానపూర్వకముగాయొసంగబడిన, సంస్థానమున, జియాజీ రావు, తలదాచుకొనునెలవు విశ్వాసరూపముగానైననూ, జూపింపకపోడు.

దామో:- మాటలతోగాకున్నయీకార్యం, చేతలతోనైననూగాక పోదు.

పీష్వా:- కావచ్చుగాని పరులకుదానముగానొసంగిన భూభాగమర్థించుటన్యాయమా?

తాంతి:- రాజ్యాక్రమణకై మనమాతనికోరుటలేదు, శత్రుదండయాత్ర నరికట్టుటకుమాత్రమే, ఆతనిసాయమర్థించుచున్నాము.

రాణి:- పీష్వాజీ, తలదాచుకొనుమర్గములేనిసైన్యము మనజాలదు, సైన్యనిర్మాణమునకును, రణవ్యూహరచనకును, జియాజీ రావుసాయమత్యావశ్యకము.

బాందా:- పీష్వాజీ, మహారాణీనిశ్చితాభిప్రాయముసమంజసమైనది.

పీష్వా:- స్వరేకానిందు భగవానునిపై భారమువైచి, యీతుదిప్రయత్నమునరింతమాగాక.

రాణి:- ఔను భగవానుడే, యీఆపత్సముద్రమునందు, దరిజేరునౌక జూపించుగాక (అనివెనుకటిదేవాదీదేవాఅనుగేయం పాడుకొనుచూఅందరూ తెరలోనికి నిష్క్రమింతురు)

---

మూడవరంగం - స్థలము : గ్వాలియర్ కోట, తెరయెత్తగా, ఒంటరిగా కళ పాడుచుండును.

అనుబంధం

ఉయ్యాలో జంపాలో

ప్రణయనౌకలో ప్రచండవాహిని | పయనము జేసే బాటసారులకు

॥ ఉయ్యాలో ॥

కళకళలాడే కారుమబ్బులో।గానము జేసే గాయకమణులకు ॥ఉయ్యా॥

ప్రళయగర్జనల పరువులుబెట్టే । పయోనిధికి నెదురీదేజీవుల ॥ఉయ్యా॥

(అంత మహారాజా జియాజీరావు ప్రవేశించును.)

కళ:- (కుర్చీనుండిలేచి పాడుచుండును )

అనుబంధం

కమాన్ కమాన్

మిష్టర్ రాజా (కమాన్)

ఓ మై డియర్ లవర్ సిట్ యిందీ చైర్ (కమాన్)

ఐ లౌడ్ యు వెరీమచ్ సిట్ యిందీ చైర్ (కమాన్)

జియా:- (కుర్చీపై అధివసించి) మొత్తంమీద నీపంతమే నెగ్గింది.

కళ:- అసలు కథేమిటో ?

జియా:- కాల్పీకోట పతనమైనదట.

కళ:- (సంతోషముతో) నిజమా ?

జియా:- నీతో అసత్యమెన్నడైనా చెప్పానా ?

కళ:— లేదుగాని యీవిషయము మెవరుచెప్పారండీ ?

జియా:— షాపం రావుసాహెబు, కాల్పీకోట పతనానంతరం, రెక్కలు గూలినపక్షివలె విలపిస్తూ, విధిబలీయమైయుంటచే, తామీ యుద్ధమున శత్రువును జయింపజాలకపోయితిమనియు, తాత్కాలి కాపజయముచేగల్గిన దుఃఖభారమున క్రుంగక, అంతిమవిజయ లక్ష్యసిద్ధికై, తమ జీవితము నర్పింప సిద్ధమైయుంటిమనియు, యీ అంతిమపోరాటంలో విజయముమాత్రం తథ్యమనియు, పీష్వాజీ వార్తాహరునంపినాడు.

కళ:— రావుసాహెబున కీదేశభక్తిపిశాచం దిగినట్లు లేదు. దొరగారి ఫిరంగులతడాఖా, ఆదిలో యెంతో, అంత్యంలోకూడా అంతే నని పీష్వాజీ గ్రహింపలేదు, యేమంటారు ?

జియా:— యేమో నాకానమ్మకంలేదు రోజుదొర అస్త్రశస్త్రపరీక్షల గురియైన మహారాజా పీష్వాజీపరిస్థితి నర్థంచేసుకోలేదంటే...

కళ:— మరి యీఅంతిమవిజయమనేశబ్దానికి వ్యాఖ్యానమేమంటారు?

జియా:— అనుటకేముంది, తాజెడ్డకోతి వనమెల్ల చెరచెనన్నట్లు, రాజ్య భ్రష్టుడైన తాను, గ్వాలియరుసంస్థానాన్నిమాత్రం, స్మశాన భూభాగం చేయకుండా వదలిపెడ్తాడా ?

కళ:— యింతకూ ఆతనిధోరణి యేమండీ ?

జియా:— పతనమైన పీష్వాకు, శత్రువును సమయంజూచి నిర్జించడానికి మరియొక దుర్గం కావాలట, అందుచేత తమపూర్వులెప్పుడో మాకీరాజ్యము దానముగాయిచ్చినారట, యీసంస్థానమిప్పుడు తమఅధీనమొనర్పవలెనట.

కళ:— సరేమీరిప్లైయేమని?

జియా:— (నవ్వుచూ) వెఱ్ఱిదానా నాకుమతిలేదనుకొన్నావా?

కళ:— లేదుగాని దేశభక్తిమెకరితలకెక్కగూడదా?

జియా:— కళా, నీప్రేమకళోపాసనానంతరం, నాకావెఱ్ఱితిరిగిపోయింది.

కళ:— ఆల్ రైట్, మీఘూటైనసమాధానంవినాలనిగంపెడంతఆశగా వుంది.

జియా:— ఆవిషయుంజూచిలీకన్యగారియెదుట నెవ్వడు, పౌజరు పెద్దామా అన్ని కొండంతకోర్కె గలిగింది.

కళ:—సరేవేళాపాళాలేకుండా యెప్పుడూ సరసాలే (అనిమూతిబిగించును)

జియా:— (బిక్కమొగముతో) కళానేనేమిచేసేది, నాదుర్బలత్వం కప్పిపుచ్చుకోవటంనాకిష్టంలేదు, నీప్రేమసుధారసాస్వాదనమరు తుణంనుండి, నీసరససల్లాపాలేనాకుస్వారాజ్యం, నీమధురనా మాటలే, నాతారకమంత్రం, నీశాసనమేనాఆదర్శకభవిష్య జ్జీవనాధారం, నీఅధరసుధారసమే......

కళ:— (కోపంతో) చాల్లెండి మీముఖస్తోత్రాలు నాకసహ్యంగా వున్నాయి.

జియా:— అదిగోకోపంవచ్చినట్లుంది, కళా దేవికోధాగ్ని హోత్రంలో యేక్షణంలో భస్మీభూతమైపోతానోఅని భయపడుతూనే వున్నాను, యీభయజ్వరమేనాకు దినదినగండంగావుంది, కాదుకాదుక్షణక్షణగండంగావుంది.

కళ:— (దుఃఖముతో) మహారాజానామనోగతాన్ని మీరర్థంచేసుకో లేదు, నిష్కల్మషమైననాపవిత్రప్రేమప్రవాహాన్ని మురికి కాల్వగాభావించారు, గళమునదాల్పవలసిన పూలదండను కాలదన్నుచున్నారు, యిదేనా మీప్రేమనైసర్గికస్వభావం? యిదేనామీనిశ్చలప్రణయసుఖానందం? లేదుమహారాజా, మీస్వభావాన్ని అర్థంచేసుకోలేకపోయాను, కామసుఖంకొరకు మాత్రమే, నన్నొకఆటవస్తువుగావుపయోగించుకొంటారని, కలనైనాభావింపలేకపోయాను, అనశ్వరమైన, యీతుచ్ఛ శరీరభోగానికే, మీజీవితాన్నిబలిచేస్తారని, విశ్వశింపలేకపో యాను, రాజ్యాధికారగర్వోన్మత్తులహృదయుం, నవనీతమని ప్రేమకూపాంధకారంలో, మునిగిపోయాను.

జియా:— (హఠాత్తుగాలేచి చేతులుబట్టుకొని, కంటనీరుతుడుస్తూ) యేడుస్తున్నావాకళా? మహారాజాజియాజీరావు, హృదయుం

పాషాణనిర్మితమనియేడుస్తున్నావా? నా ప్రేమారాధనదైవతా మూర్తివగు, నీహృదయదుఃఖాగ్నులురగుల్కొంటే, నాస ర్వాంగములు భగభగ మండిపోవా? రాగాతీతమైన ప్రేమ శబ్దానికి, ఆ పవిత్రాక్షరములకు, లోకాలోకాల్లో స్థానం వుంటుందా? సృష్టివిధానంతల్లక్రిందులుగాదా? గ్రహగతులు మారవా? కువలయంకూలిపోదా?నానిశ్చలహృదయాకాశంలో విహరించే, ఓ ప్రణయదేవతా, అజ్ఞానాంధకారజగదావనా నందరూపీ, సుస్థిరప్రణయసామ్రాజ్యపట్టమహిషీ, ఐహికా ముష్మిక, విజ్ఞానప్రేమతత్వానంతరహస్యబోధనాపరవాగ్దేవీ, నన్నుశంకింపుచున్నావా? నాఅపరాధమేమి? యీకథాభాగం యీవిధంగాదుఃఖాంతంగాపరిణమించుటకుకారణమేమి?

కళ:— కారణమే తెలియదా? ఆత్మార్పణచేసినఅబలకై క్షణక్షణ గండంగాజీవయాత్రసాగించుమహారాజా, జియాజీరావుగారికి కారణమే తెలియదా?

జియా:- క్షమించుకళా, పరిహాసానికన్నమాటలకేయింత రాద్ధాంత సిద్ధాంతంచేస్తావా? (అనిబ్రతిమ లాడుచుండును)

కళ:- (సంతోషముతో) మీకేమహారాజులు, రాజుదలచుకొంటే దెబ్బలకు కొదువేముంది లెండి, యేమయితేయేం క్షణంలో యేడ్పించారు, అమరుక్షణంలో నవ్వించారు, సరేకాని పీష్వా రావుసాహెబుగారికి మీసమాధానమేమిచ్చారో చెప్పితిరిగా రేమి?

జియా:- నాసమాధానమా? మాభూమిలోమీకాశ్రయమిచ్చిన మీ వలె మేమును రాజ్యభ్రష్టులముగాక తప్పదనియు, అందుచే మీకీగ్వాలియర్ సంస్థానములో మావలనయేవిధమగు సహా యము లభింపజాలదనియు, అట్టిప్రయత్నము మరియెన్నడై ననూచేయుచో శత్రుచర్యగా భావింపబడుననియు, నాసమా ధానము? చాలునా?

కళ:- వెరీగుడ్, మహారాజా పీష్వాజీ యీ దెబ్బతో, వేటకాని యమ్ముతో కూలినపక్షి వలెహతాశుడు కాక తప్పదు

జియా:- కళాదేవి అనుగ్రహమార్జించిన మేము, మీ బహుమానబిక్ష వేడక తప్పదు,

కళ:- (సిగ్గుతో తలవంచుకొనును)

జియా:-నిరుత్తరమంగీకారమన్నారు పూజ్యులు. ఐతే కోరుకొంటాను, కళా, కండచక్కెరకంటె మధురమైనదేది ?

కళ:- ప్రేమ.

జియా:- అమృతముకంటే మృతము కానీయనిదేది ?

కళ:- ప్రేమ.

జియా:- (సంతోషముతో) ప్రేమ, ఆహా యెంత తీయనిఅక్షరాలు, ప్రేమ.

(అంత జియాజీరావు ఆంతరంగిక కార్యదర్శి త్వరగా ప్రవేశించి నమస్కరించును.)

జియా:- విశేషమేమి ?

కార్య:-మహారాజా, పీష్వాజీవద్దనుంచి శరవేగముతో వార్తాహరుడు జాబు కొని తెచ్చినాడు.

జియా:- (పండ్లుకొరుకుచూ) పీష్వాజీ జాబు వినవలయును.

కార్య:- (చదువుచుండును.)

శ్రీ శ్రీ శ్రీ

గ్వాలియరు సంస్థానాధిపతులగు జియాజీరావుగారికి, పీష్వారావుసాహెబు పంపు అంత్యసందేశం,

మీ ప్రత్యుత్తరం క్షమింపరానిదై యున్నది. విధి ప్రేరణమున కాల్పి పతనమైనది. యీ తాత్కాలికాపజయముచే మహోత్కృష్టమైన స్వాతంత్ర్యసమరం విరమింపదలపలేదు. అంతిమవిజయలక్ష్మీ సాధనకే గ్వాలియరుదుర్గం కోరినాము, గాని సంస్థానాక్రమణకుగాని మీ స్వేచ్ఛాప్రవృత్తుల సరికట్టుటగానీ, మా సంకల్పముగాదు. మహా

భాగా, అస్వతంత్రభారతంలో, జీవించుటకంటె, వీరపురుషుడై మర ణించుట, దేశక్షేమముగాదా? క్రుళ్ళిపోయినజాతిసౌభాగ్యము దలంచు కొన్నచో, హృదయమ్ము వ్రయ్యలు గాకుండునా? దేశభక్తోన్మాదుడ నైతినని నన్ను మీరాక్షేపించారు, నిజమే, యీఉన్మాదాన్ని నేను మనసారా ప్రేమించాను. నాదేశ కొరకు నేను అధమాధముడను రాజుగా వ్యవహరించుటకంటె, ఫకీరుగానో సంచరించుట గర్వింప దగినకారణముగాదా? మిత్రమా, అనశ్వరమైన, యీ తుచ్ఛదేహం కొరకు, అమూల్యమైనజీవితం పుట్టగొడుగువలె వ్యర్థము చేయజాలను, మాచేమీకుదానపూర్వకముగా నివ్వబడినట్టి గ్వాలియర్ దుర్గం మా కాశ్రయమొసంగ గలదని యీ తుదిఘడియలోకూడా యిమ్మర్థించు చున్నాను జయశ్రీ వరించిన తక్షణమే యీదుర్గము విడువగలమని అభయహస్తమిచ్చుచున్నాము. మా న్యాయమైనకోర్కెను మన్నిం చుట, మీవిద్యుక్తధర్మము, వినయపూర్వకముగు. మావిజ్ఞాపనత్రోసి రాజన్నచో, శత్రుచర్యగా భావించి, మీపైసమరమొసర్ప నిశ్చ యించినాము, పూజ్యభావా మాకార్యనిర్వహణం యిరువదినాలుగు గంటలలో మీరిచ్చుప్రత్యుత్తరంపై ఆధారపడియుండగలదు, యీ నాసందేశమే, అంత్యసందేశముగా భావింతురుగాక

ఇట్లు
పీష్వారావుసాహెబు

కళ:- సరే మహారాజా జియాజీరావుగారికి రాజ్యభ్రష్టులైన రావు సాహెబు యిరువదినాల్గుగంటల అల్టిమేటమ్

జియా:- (కోపముతో కత్తిదూసి) అవును. అర్థంలేని యీఅల్టిమేటానికి మహారాజా జియాజీరావు, ఖడ్గము జవాబుచెప్పగలదు, ప్రజా విప్లవసంస్థ మార్గమే, వీరికిశరణ్యముగుగాక, మహారాజా జియాజీరావు, అశేషబల సామర్థ్యమేమో, పీష్వాజీస్వయ ముగా తిలకించుగాక,

(అనినడచుచుండ తెరపడును)

# ఝాన్సీ రాణి

## పంచమాంకము

మొదటిరంగము, స్థలము గ్వాలియర్ కోట, రావుసాహెబు, బాందానవాబులు
పచరంగమాడుచుందురు, (తెరయెత్తబడును.)

బాందా:- అదుగో చూడండి, పీష్వాజీచే బంధింపబడిన మహారాజా జియాజీరావువలె, నా మంత్రిచే మీరాజు బంధింపబడగలడు.

పీష్వా:- పొరపడ్డారు, శకటు కాపుగానున్న నారాజెట్లు బంధింపబడగలడు? గాని నాయీ యుపాయము చే, మీ ప్రధానామాత్యునకు, ప్రాణోపద్రవము సంభవించినది. యీ ప్రమాదం తప్పుకోగలరా? (అని గుఱ్ఱపుయెత్తు వేయును)

బాందా:- మరేమీ ప్రమాదం లేదు, మీ గుఱ్ఱానికి నాబంటు సమాధానము చెప్పుటకు చాలును (అని బంటును ముందుకు నెట్టుచుందును)

పీష్వా:- (నవ్వుచూ) బంటును ముట్టుకోవద్దు, మంత్రితో రాజుపహా అవుతుంది.

బాందా:- సరే నా మంత్రికి రక్షణే లేదా?

పీష్వా:- మరేమీ ప్రమాదం లేదు, యెత్తు మార్చుకోవచ్చును.

బాందా:- (ఆలోచించుచుందును)

పీష్వా:- యేమాలోచిస్తున్నారు?

బాందా:- ఆ, మరేమీ లేదు......

పీష్వా:- సందేహించకుడు, యెత్తు మార్చుకోవచ్చును,

బాందా:- పీష్వాజీ, నేడు నా మనస్సు ఖుషీగా లేదు, అందుచే యీ ఆటను ఖతం చేస్తే, బాగుంటుందేమోనని యోచిస్తున్నాను.

పీష్వా:- అయ్యో యింతవరకేల చెప్పరైతిరి? (అని) యెవడురా అక్కడ (అంత చేతులు నలుపుకొంటూ ఫ్యూర్ ప్రవేశించును.)

పీష్వా:- అతిత్వరితమున కళా ప్రవేశమునకు రాజాజ్ఞ......

సేవ:- చిత్తం (అనిపోయి కళనుతోడ్కొనివచ్చి నమస్కరింపుచూ నిష్క్రమించును) కళపాడుచుండును

అనుబంధము

కోయిలా కోయిలా ఒకరాగముపాడవే కోయిలా
కూ-కూ-కూ- రాగముపాడవె కోయిలా.. (కోయి)

గాలితెరగలో తేలిపోయే మేఘరాశినిను మెచ్చినటే ప్రేమ బంధమున బిగియించెనటే (కోయి)

గున్నమామిడీ చెట్టునీడలోకూర్చున్నా మరుడేమన్నాడే నన్నాఅమ్మల జిమ్మాడే. (కోయి)

(అంతబాందా వాబుఆనందపారవశ్యమున తలఆడించుచూ, కళవంకవెట్టిచూపుచూచుచుండును, కళచిరునవ్వునవ్వుచురాగాలాపన చేయుచుండును, అంతకోశాధికారిత్వరగారోజుకొనుచూవచ్చి) ప్రభూ ప్రభూ

పీష్వా:- విశేషమేమి? బ్రాహ్మణసంతర్పణనిర్విఘ్నముగాకొనసాగెనా? ద్విజులుయిష్టాన్నతుష్టులైనారా?

కోశా:- ఆహాయిష్టమృష్టాన్నసంతుష్టులైనారుకాని......

బాందా:- నీళ్ళునములకోయ్, పానకంలోపుడకవలెదాపురించావు' యిప్పుడొచ్చినప్రమాదమేమో చెప్పు.

కోశా:- మరేమీలేదు, ప్రభూ, బ్రాహ్మణభోజనానంతరంసంభావనకుదొడ్డికిరమ్మనిపిలచితిమి కాని ఒక్కబ్రాహ్మణుడుకదలుటలేదు

పీష్వా:- కారణమేమి ?

కోశా:- మరేమున్నది? ప్రభూఒకొక్కతలకుపదిబంగరునాణెములు చాలవట, మహారాజా స్వయముగాతమతోమనవిచేయగలమని దర్భాసనములుపరచి కూర్చున్నారు, షోడశకళాప్రసన్నముకావలెనట.

పీష్వా:- సరేద్విజసంతుష్టియొనర్చుటమావిద్యుక్తధర్మము, వారికోర్కెనెరవేర్పుము.

కోశా:- చిత్తము (అనిపోవును)
(అంత బాందాన వాబుకళవంక జూచుచుండునుకళపాడుచుండును)

అనుబంధము

ప్రణయవార్ధిలో పడుగులుబెట్టి । తరంగల్లారా నిలవండీ
నను మీవెంటను గొనిపొండీ (ప్రణ)

హృదయమర్మమున కూరటలే నీ । ప్రేమజ్యోతిని పిలిచారా.
హాయిగ పాటలు బాడారా. (ప్రణ)

చందమామలో కందిన లేడిని । పొందుగ కౌగిట చేర్చారా
అందంబును గనుగొన్నారా. (ప్రణ)

బాందా:- అచ్ఛా అచ్ఛా, యేమీసుఖం యేమీసుఖం (అనితలత్రిప్పు
చుండును అంతకోశాధికారి మరల ప్రవేశించి) ప్రభూప్రభూ

బాందా:- (ఉలికిపడి) నీకు మతిపోయింది బద్మాష్.

కోశా:- (వణకుచు చేతులు నులుముకొనుచుండును.)

పీష్వా:- మరేమి ?

బాందా:- సంభావనకు సామాన్యబ్రాహ్మణులు సంతోషించినారు,
కాని వేదపాఠకులే మా వేడికోలు మన్నించుటలేదు. ప్రవర
పాఠకులగు అవధానులు, తమతమవిద్యల పరీక్షించి, సంభా
వింపదగునని మొండికెత్తుచున్నారు. ప్రభువులతో మనవిచేసు
కొందునని వచ్చినాను.

పీష్వా:- యీ కార్యము మహాపండితులగు, మీపై మోపబడినది,
ద్విజులవిద్యార్హత గమనించి, సంభావించుటకై మీకధికార
మొసంగబడినది.

కోశా:- చిత్తం (అని పోవుచుండును.)

బాందా:- (కళవంకజూచి) ఊ.

కళ:- (పాడుచుండును.)

అనుబంధము

సీఫా సీవా ఓ హూ (సీవా)
గానమొనర్చ గందుతుమ్మెదా (సీవా)
హృదయాకాశావీధిలో దిరిగే।విశ్వమయీ నను ప్రేమించావా ॥సీవా॥
మధురమధురమగు మంగళగీతము।మనసారా ఒకమారుపాడవే॥సీవా॥

బాందా:- హచ్చా హచ్చా, నవాబుగారి రత్నహారం మీకే బహుమానం. (అని మెడలోనున్న హారముయిచ్చును,అంత మహారాణీప్రవేశము, రత్నహారము చేజారి క్రిందబడును, వణకుచు రత్నహారము కన్నులకద్దుకొని కళ తలవంచినిలబడియుండును)

రాణి:- మహాప్రభూ...

పీష్వా:- కథాభాగం రసఘట్టంలోనున్నది, నీవిప్పుడడ్డుదగులకమ్మా.

బాందా:- పులినిగాంచిన లేడిలాగా, భయకంపితయైన యీమెను గాంచితివా? మహారాణీ, నీరాక మామనోల్లాసమునకు వజ్రాఘాతం.

రాణి:- వజ్రాఘాతం, స్వాతంత్ర్యదీక్షాయజ్ఞఫలభోగులగు మీమనోల్లాసమునకు నారాక వజ్రాఘాతము,

పీష్వా:- మహారాణీ, బాందానవాబు దేశభక్తిని శంకింపుచున్నావా?

రాణి:- లేదు ప్రభూ,

చం. కళకళలాడు నీభరత।ఖండము సంతతమేళ్ళుకోళ్ళుగా
జలజల బాష్పపూరములు । జారినకన్నులతో కృశాంగియై
వెలవెలబోవు దుస్థితికి । విందులు భోగవిలాసకార్యముల్
బలమగు నంటుజాడ్యములు।భాతి సకారణమై మెలంగెడిన్,

పీష్వా:- లేదు, మనోల్లాసమునకొనర్చు కార్యములు, విలాసవృత్తులు కాజాలవు.

రాణి:- ఆదిలో అట్టివే కావచ్చును, కాని అంత్యములో, విషఫలిత మీయగలదు.

బాందా:- ఇదియొక వెఱ్ఱివాదము.

రాణి:- సోదరా, పతనమైన భారతజాతి నుద్ధరింపరా? పొంచియుండిన ఆంగ్లేయబొబ్బిలి, మీచే జారవిడచిన, యీ యవకాశమును పోగొట్టుకొనునా?

పీష్వా:-హా-హా-హా-బొబ్బిలి,ఆంగ్లేయబొబ్బిలి,యెంత వెఱ్ఱిదానవమ్మా

రాణి:- ప్రభూ, మీవీరత్వమును నేను శంకించుటలేదు, కాని భారత దేశచరిత్రను విస్మరింపకుడని మిమ్ము ప్రార్థింపుచున్నాను,శత్రు బల మలక్ష్యమొనర్చి, మనోల్లాస కార్యఫలితమే, నేటి దాస్య భారతచిత్రస్వరూపము. ధనకోశాగారము విందులతో, విలా సములతో, వమ్మొనర్పకుడని వేడుచున్నాను. తద్ధనము జాతీయసైన్యమునకు వెచ్చింపుడని, విశ్వకల్యాణప్రియులగు మీకు వినతులిడుచున్నాను.

పీష్వా:- మీపల్కులలో మాకు విశ్వాసములేదు, శత్రుదండయాత్రి నరికట్టదగు ఫౌజు మావద్ద లేకపోలేదు,

బాందా:- మహారాణీ, ప్రభునాగ్రహామునకు గురియగుచున్నావు.

రాణి;- సోదరా, భ్రాతృసమానుడను, ఆబాల్యమిత్రుడును అగు పీష్వాజీ నాపై...

బాందా:- అవును, అతిక్రాంతమర్యాదవైన విషఫలితం, రాజాగ్రి హాముకాదా ?

పీష్వా:- మహారాణీ, గ్వాలియర్ సంస్థానరక్షణకై శత్రుప్రమాదము గుర్తించి, పలయు రణసన్నాహాము గావించినాము. నీవింక నిశ్చింతను డవచ్చును.

రాణి:- పోనిమ్ముప్రభూ, పితృమూర్తివగు మీకునా ధ్యోపిక కొలంది నుడివినాను, ఆపైని పీష్వాజీయాజ్ఞల పాలింప సిద్ధముగా నున్నాను, (అని తెరలోనికిపోవును, రావుసాహెబు మెడనున్న రత్నహారము కళకొనంగును, కళ హారముకన్నులకద్దుకొని పీష్వాజీ బాందానవాబులకు నమస్కరించి నిష్క్రమించును.

అంత శాంతియా తెరలోనుండి, క్రిందిపద్యంపాడుచూ ప్రవే
శించును)

తే॥గీ॥ భరతపుత్రుల శౌర్యంబు। చెరగెనంచు
బందిపోటుగ గ్వాలియర్। బట్టదలచి
రేయిపవనంబొనర్చె ఆం। గ్లేయులార
కరుగ లేదింక• శాంతియు। ఖడ్గబలము

పీష్వా:- గురుదేవ్ మరలయుద్ధమా?

శాంతి;- అవును బాబూ

ఉ. చీకటివేళలన్ నడచి। చేవలు దేలిన జాతిశక్తులన్
కూకటిద్రెళ్ళతో పెరుక। గోరెడిశత్రువురాజభక్తి ము
శ్కాకలుదీరు యోధులను। కయ్యమొనర్పగబంపెనేడు మీ
బాకులు దూసి లెండు మన। భారతమాత ఋణంబుదీర్పగన్

(తెరపడును)

---

రెండవరంగము.- స్థలము గ్వాలియర్ కోట, యుద్ధరంగము, బాందానవాబు వెనుదిరిగిచూచుచూ, ఒంటరిగా పారిపోవుచుండును. తెరలో ఫిరంగులు మ్రోగుచుండును రెండవ వైపునుండి, విశ్వపతి బాందానవాబును అడ్డగిండును, నవాబువణకుచుండును,

విశ్వ:- నవాబుగారింకెక్కడికి పోతారు, పామువగబట్టే ప్రాణముం
డగా వదలిపెట్టదు, విశ్వపతి పగబట్టే. జన్మ జన్మాంతరాల
వరకూ, వదలిపెట్టడు,

బాందా:- (మెడనున్న రత్నహారముతీసి విశ్వపతి చేతికిచ్చుచూ)
నామర్యాద కాపాడు బాబూ.

విశ్వ:- (రత్నహారముగై కొని) ఆపప్పులుడకవు, దొరగారిచ్చే బహు
మానంలో పాతిక భాగం దక్కలేదు, గుడ్డిప్రభువులకేం తెలుసు
గోడను మోడంటే నమ్మతారు, మోడును గోడన్నా అంతే
యింతకూ యీధర్మసిద్ధాంతం యెందుకుచెప్పేనంటే దొర
గారికి చెవులేగాని, కళ్ళులేవు, చేజిక్కిన మిమ్మల్ని వదలిపెట్టా

నంటే, నాకుతిక లంకించుకొంటుంది, డబ్బుకుగడ్డితిన్నానంటే

బాందా:— కాలహరణం చెయ్యకు, నీమేలు మరచిపోలేను, మా స్వగ్రామంచేరుకున్న తర్వాత ... ... ...

విశ్వ:— ఆపత్కాలంలో అందరిల్లాగోల పెట్టారు, యెవరిమాట నమ్మ తాం, యెవరిమాట కాదంటాం

బాందా:— (వెనుదిరిగిచూచుచూ భయముతో) అదిగో శరవేగంతో బ్రిటీషుసైన్యం వెంబడించుచున్నది. బాందానవాబుప్రాణం నీచేతిలోనున్నది.

విశ్వ:— సత్యంగ్రహించావు, శత్రుపక్షములోని వాడవైనా నాగొప్ప తనం గ్రహించావు, పెట్టినెంగళప్పలుకొందరు, నేనుప్రపంచ జ్ఞానం లేనివాణ్ణని విమర్శిస్తున్నారు. యీచేతగాని దద్దమ్మ విమర్శన నేనువప్పుకోను,

(అంత తెరలో ఫిరంగులమోత) విశ్వపతీ, విశ్వపతీ, చేజిక్కిన బాందానవాబును పారిపోనీక నిలువరింపుము,అని కేకలు,భయ ముతో బాందానవాబు తెరలోనికి పోవును.

విశ్వ:-(వెనుదిరిగిచూచుచూ) నవాబును వదలపెట్టడమే, నాకంఠంలో వూపిరివుండగా ఆపనిమాత్రం జరుగదు, కాని దొరగారిప్రథమ బహుమానంమాత్రం నాకే చెందాలి, యీ విషయాన్ని పదే పదే మీకు నొక్కిచెబుతున్నాను. తర్వాతపేచీపెట్టే లాభం లేదు, రండి, తొందరగా రండి. ఊ పెళ్ళినడకలు నడుస్తారేం, శరవేగంతో, కాదు, కాదు, వాయువేగంతో పరుగెత్తండి, నవాబుగార్ని నా అరచేతిలో బంధించాను, నా యీ గుప్పిలి వదలించుకోటానికి ఆతన్ని పుట్టించిన,బ్రహ్మచేతగాదు. నాప్రతా పం నేనుచెప్పుకోగూడదు,గాని మీఅందరికళ్ళల్లో దుమ్ముగొట్టి పారిపోయే, గడ్డం లంకించుకొన్నది నేనే (అని వెనుదిరిగి తెల్ల బోయి) కొంపమునిగిపోయింది,నవాబు నాకళ్ళల్లో కారంగొట్టా డు, ఓయి దేవుడో, యీవుద్యోగం నాప్రాణంమీదకొచ్చింది, (అని తొంగిచూచి తలవూపుచూ) కనుచూపుమేరలో నవాబు

జాడ లేదు, పాపిష్టిముండాకొడుక్కి పిక్కబల మెక్కడనుండి వచ్చిందో, దేవుడికే తెలియాలి, ఓయి దేవుడా, నీకీవక పాత బుద్ధి యెందుకుస్వామీ, నీ కేమపరాధము చేశాను, యేవుణ్యాత్ములైనా ఆలయంకట్టిస్తుంటే, అడ్డుపిటీషను పెట్టానా? ధర్మ ప్రభువులు ధర్మసత్రాలునిర్మిస్తుంటే, రాళ్ళుగొట్టానా? యే శాంతికాముకులైనా బ్రాహ్మణులకు, భూదానగోదానాదులు చేస్తుంటే, శనిగ్రహంలాగా అడ్డుపడ్డానా? అన్నంలో సున్నం కలిపేఅభ్యాసం ఆదినుంచీ లేదే, మరియీదినగండం బ్రతుకెందుకు? (అని యేడ్చుచు) తండ్రీభగవానుడా, యీపాపం యీజన్మలోదికాదు, పూర్వజన్మంలో యెవడిగొంతుమీద కత్తిపెట్టానో, యీ జన్మలో క్షణ క్షణం నా గొంతుమీద కత్తి పెట్టుతున్నాడు, అయితే రోజుదొరగారు చల్లనిప్రభువు కాబట్టి, యీమాయదారి గణ్ణాలు తప్పించుకొన్నాను, నేడా యాశతీరిపోయింది, అయ్యో దేవుడా దేవుడా (అని యేడ్చుచుండును అంతరక్తసిక్తాంగియై తలకును, కరచరణములకును కట్లు కట్టుకొని క్రిందిగేయం పాడుకొనుచు మహారాణి ప్రవేశం)

అనుబంధం

నా దేశం నా దేశం
జానిస దేశం – భారత దేశం – (నా దేశం)
కర్మవీరులను గన్నస్వదేశం –
కళ కళ లాడే కాంచన దేశం (నా దేశం)
విజయపతాకం విసరే దేశం
విప్లవయోధుల పిలచే దేశం (నా దేశం)

(అంత విశ్వపతి భయముతో వణకుచు చచ్చానుదేవుడో అని తెరలోనికి పారిపోవును)

రాణి:– (రక్తము చేతనద్దుకొనుచూ) నాజన్మధన్యము, మాతృదేశ సేవారాధనకై బలియొసంగిన నాజన్మమాన్యము (అనితూలుచూ) మహారాణీనీవికసుఖనిద్రజెందవచ్చును, స్వేచ్ఛానందములతో

నీకన్నగడ్డకొఱకు కాయమర్పింపుచున్నావు దేశకల్యాణమే నీ జీవితాదర్శమని, ప్రపంచమునకు ఘంటాబజాయించినావు, వీరులకు జన్మహక్కు గాని, భీరులకు నవభారతంలో స్థానం లేదని, చరిత్రలో సువర్ణాక్షరాలు చెక్కింపనున్నావు, ఖండఖండాంతరముల భారతస్వాతంత్ర్య ప్రథమయుద్ధములో, ఆంగ్లేయుల నెదిర్చిపోరాడిన వీరనారి ఝాన్సీరాణియను యశోగీతికల, విరజిమ్మినావు- అ...బ్బా...ఆయాస...ము... (అనిగొంతతడవుని దానించి) నా..దే..శం..నారత్న..గర్భ..నా.మాతృదేవి. ఆహా నాకన్నగడ్డకు ర.క్తం, హృదయబలిదాన.రక్తం, దేశసేవారాధనరక్తం, యిదిగో యీ రక్తం, విప్లవజ్వాలల వుబికిపొంగిపారలేర..క్తం, శాంతిరాజ్యస్థాపనాప్రయత్నమునకై, పర్వులెత్తు రక్తం, పతితమై ఉజ్జ్వలమై, అరుణమైన, యీ రక్తప్రదానం, నవభారత రాజ్యస్థాపనాప్రయత్నముతో సఫలీకృతమనోరథయగుగాత, దేశస్వాతంత్రమునకీ మహాజ్వాలరక్తమే, మార్గదర్శియగుగాక, (సంతోషముతో) పరరాజ్యాక్రమణచిత్తోన్మత్తులగు ఓ ఆంగ్లేయులారా, రక్తప్రభావమేమిగానిర్ణయించితిరి.

సీ॥ ఈరక్తమున వీర । పూరుషసింహాముల్
బొట్టుబొట్టుకొకండు । బుట్టుచుండు
ఈరక్తమున దేశ । హితకర్మభోగుల
సహజశౌర్యప్రభల్ । చాటుచుండు
ఈరక్తమున మోసు । లెత్తి బానిసజీవి
గుండెలు భగభగ । మండుచుండు
ఈరక్తమున సర్వ । భారతక్షోణిలో
విప్లవజ్వాలలు । విసరుచుండు

తే॥గీ॥ చెలగి యీరక్తమునముంచి । శిల్పకారు
కుంచెలో కంచుకోటలు । కులుకుచుండు
కడగియీరక్తమున చిందు । కవులచేతి
కలముల సువర్ణవర్ణముల్ । గ్రక్కుచుండు.

(యెదుటచూచిహర్షముతో) మాతృభూమికై మరణించు ఓ విప్లవయోధులారా, మీకిదేనా జోహారులు, కర్మవీరులై ఫలాఫల కాంక్షారహితులై, రణక్షేత్రమునభోరాడు, నా దేశభక్తులారా మీకిదేనాధన్యవాదములు, ఆదర్శకజీవులై, ఆత్మార్పణచేయుసై నికు లారా, మరణించండి, నేటిమీమరణరేఖలనుండి, స్వతంత్రభానో దయంకాగలదు, మీతారకమంత్రంమరణం, మీధ్యానంమరణం, మీమననంమరణం, (అనితూలుచూ)

తే॥గీ॥ రక్తవారధిలో ఝాన్సి । రాణినౌక
మునుగనున్నది స్వేచ్ఛావి । భూతికొరకు
బనరమునగూలు నాదేశ । భక్తులార
మడమత్రిప్పని యోధులై । నడువుడింక.

(అని క్రిందపడిపోవును అంతదామోదరరావు, తాంతియా, రావుసాహెబురామచంద్రదేశముఖులప్రవేశం)

దామో:- (యేడ్చుచూ) అమ్మాఅమ్మా, అయ్యోయింకెక్కడితల్లి, యెక్కడిలోకము, స్వతంత్రరణములోవీరనారివై, శతృక్రో ధాగ్నిలోభస్మీభూతమైపోయినది, అమ్మానీసుధామధురవాక్య ములనాలించుభాగ్యమునాకులేదా? మహారాణిలేని నాజీవిత మికఅడవిగాయువెన్నెలవలె నిరర్థకమేనా? తల్లీ పలుకవా? అమ్మా నాగతియేమిచేసితివి?

సీ॥ ఝాన్సిరాజ్యము భుజ । స్కంధమ్ములనవోతు
తండ్రీయటంచు నే । తల్లిపలుకు
తల్లియశమునిల్పు । దామోదరా యంచు
యేయమ్మ ముద్దాడి । యేత్తుకొనును
జాతీయగీతముల్ । చదువుబాబూయంచు
యేమాతహృదయాన । ప్రేమహత్తు
దేశసేవారతిన్ । దేలు మన్నా యంచు
యేరాణి కన్నుల । నీరునింపు

తే. గీ. అమ్మహావీరసాధ్వి సంపన్నగృహిణి
కీర్తిచంద్రికలఁ జల్లు । గేస్తురాలు
సర్వలక్షణశోభిత । ఝాన్సిరాణి
కాలగర్భమ్మునఁ నేడు । రాలిపోయె.

శాంతి:— ఆహా, దుర్విధీ, నీవెంతక్రూరుడవు,

సీ. ఎపుడు స్వేచ్ఛావృత్తికే కాయమర్పింప
పట్టినబూనిన దేశ । భక్తురాలు
ఎపుడు ఎత్తినకత్తి । నెగయు శౌర్యజ్వాల
పగతురపై గుప్పు । భరతపుత్రి
ఎపుడు శాత్రవకోటి । విపులప్రతాపాగ్ని
చల్లార్చజాలిన । సాధ్విమిన్న
ఎపుడు స్వదేశీయ । హితకర్మఫలభోగ
విమలభావోద్వేగ । వీరనారి

తే. గీ. ఎపుడు నాదేశమిది స్వైరవృత్తికొరకు
కదనమునజత్తునంచాడు । కర్మయోగి
మాలదైవము, యీవీరమాత నిటుల
పొట్టనింపగ నీకేమి । వుట్టిమునిగె.

పీష్వా:— మహారాణీ, మ...హా...రా...ణీ.

రాణి:- (కన్నులు తెరచి) పీష్వాజీ,

రామ:— ధన్యులము, రాజమాత యింకను బ్రతుకుననను ఆశ లేక పోలేదు.

రాణి:- (శిరఃకంపముచేయుచు లేచికూర్చొని) పీష్వాజీ, మాతృదేశముకొరకై మరణశయ్యపైనున్న నాకై దుఃఖింపకుడు. దేశక్షేమమాకాంక్షించి, మాతృవిహీనుడగు కుమార్ దామోదరు ప్రాణభిక్షపెట్టుడు.

పీష్వా:- (యేడ్చుచూ) మహారాణీ, దురభిమానపిశాచావేశుడనై, జగదేకవీరప్రతాపివగు నీవీరత్వమలక్ష్యమొనర్చినాను, స్వాతంత్ర్యపురోగామివైన నీహితోపదేశం పెడచెవిబెట్టినాను. అమృతోపమానమగు నీ వచనముల నిరాదరించి, దేశద్రోహినైనాను. శిరోధార్యమగు మణికిరీటము కాలదన్నినాను, యిది నా స్వయంకృతాపరాధము. మహా-రాణీ, స్వయంకృతాపరా-ధ-ము.

రాణి:- అబ్బా (అని తలను రెండుచేతులబట్టుకొని) పీష్వాజీ,

పీష్వా:- (యేడ్చుచూ) తల్లీ, దేశారిష్టతకై మహారాజపాత్ర ధరించిన, నా పాపమునకు ప్రాయశ్చిత్తములేదు. రాజ్యమదాంధకారమున, రానున్నయాపద నెరుంగ లేని మూఢుడనై కన్న గ-డ్డ-కు-సాపరాధ-మొ-న-ర్చినా-ను. నా-జీ-వి-తం-కలుషభూయిష్టమైనది. భావిభారతచరిత్రలో రావుసాహెబుచే జాతీయశక్తులు నిశ్శేషమై అంతరించెనను, అపయ-శ-మే- నా జీవి-తమునకు-మిగి-లిన-ఘట్టం.

(అంత తెరలో మహారాణిని సజీవములతో బంధింపుడు అను కేకలు)

రాణి:-(ఆయాసముతో రామచంద్రరావువంక దిక్కై (-) త్వ-ర-పడుడు నేటి యీ-అవసానదశ-లో-శత్రు-హ-స్తము-నన్నంట-కుండునట్లు గాపాడుడు. చి-తి-జే-ర్పు-డు. ఇ-ది-నా-అం-తి-మ-వే-డికోలు. (అని రెండుచేతులు జోడించి) ప-ర-మే-శ్వ-రా పు-న-ర్జ-న్మ. దేశస్వా-తంత్ర్యమునకై పు-న-ర్జ-న్మ. ఆం-గ్లే-యుల-హ-తమా-ర్చు-ట-కై-పునర్జన్మ-ప్రసా-దిం-పు-ము. పర-మే-శ్వ-రా-ప్ర-సా-దిం-పు-ము.

(అని భూమిపై వ్రాలును. తెరపడును.)

మూడవరంగము, స్థలము, ఝాన్సీకోట, దులాజీరావు, రోజుదొర, వృన్నాసనములనధిష్టించి యుందురు, కళనిలబడియుండును, టేబిల్ పయి బ్రాందీసీసాలు పెట్టబడియుండును, ఫ్ల్యాగ్ నిలబడియుండును, (తెరయెత్తబడును)

రోజు:- యేదీ ఆ కోయిలపాట పాడు కళా,

కళ:- (పాడుచుండును.)

కోయిలా కోయిలా ఒక రాగముపాడవె కోయిలా
కూ - కూ - కూ రాగముపాడవె కోయిలా (కోయి)
గాలితరగలో తేలిపోయే మేఘరాసినను మెచ్చినటే
ప్రేమబంధమున బిగియించెనటే (కోయి)
గున్నమామిడీ చెట్టునీడలో కూర్చున్నా మరుడేమన్నాడే
నన్నా అమ్ముల జిమ్మాడే (కోయి)

(అంతవిశ్వపతి పర్వెత్తుకొనివచ్చి) దొరా, యేనుగులాంటి మోరోపంతు పీనుగై పోయాడు

దులా:- (సంతోషముతో) మోరోపంతు ఉరితీయబడెనా?

విశ్వ:- ఆహా దొరగారు తలవంచుకొంటే, బ్రహ్మదేవుడే బ్రతకలేదు మోరోపంతు లెక్కేమిటి, ఐతే గుండెగల ముండాకొడుకు, కాదుబాబో రాక్షసిముండాకొడుకు, కాకపోతే ప్రాణంపోయే టప్పుడుకూడా, కన్నుల నీరునింపలేదు, వురితీయబోయే సమయంలో రెండు చేతులు జోడించి, తండ్రీ పరమేశ్వరా, జన్మరహితమునకై నిన్ను ప్రార్థింపను, నాకుపునర్జన్మము సమకూర్చుము, మనుష్యజన్మ గల్పించుచో ఆంగ్లేయుల హతమార్చి వీరునిగా స్వజింపుము, పాపకర్మోద్ధతిచే, క్రిమికీటకాదులలో పుట్టింపజేయుచో, దేశభక్తితో మరణించునట్లు వరము ప్రసాదింపుమని(అని కన్నులనీరునింపి) యింతలో తలయెగిరిపోయెను

దులా:- (రోజుదొరవంకదిక్కై)సార్ నేటికి నామనశ్శాంతి గల్గినది

రోజు:- లేదు మావాగ్దానం పూర్తిగాకపూర్వమే ... ... ...

దులా:— దొరగారి కృపాదృక్కులు ప్రసరించువరకూ ఝాన్సీరాజ్య లక్ష్మి దులాజీరావును ... ... ... ...

రోజ:—అవును, మీ ఆశయం త్వరలో సిద్ధించగలదు (అని ప్ల్యాక్ వంక జూచును, ప్ల్యాక్ బ్రాందీగ్లాసందించును)

దులా:— (త్రాగి మొగము చిట్లించి) సార్, నేడీ పానీయం విశేషమగు క్రొత్తరూపం ధరించినది

రోజ:— నేటిసంతోషాన్ని చిహ్నంగా ఫారిన్ నుంచి దులాజీరావుగార్కి రవాణా చేయించినాము.

దులా:— (వాంతిబాధనభినయిస్తూ) సార్ క — న్ను - లు — తిరిగి పోతున్నవి నా లు క ... ... ... ...

రోజ:— మరేమీ ప్రమాదములేదు నిషాకొరకుమాత్రమే —

దులా:— లేదుసార్ యిందేమో మోసంజరిగింది, సర్వాంగములు దహించుకు పోవుచున్నవి, నాల్క తడియారుటలేదు, కరచరణములు తేలిపోవుచున్నవి, తుదకు ప్రతిఅవయవము నాస్వాధీనత తప్పిపోవుచున్నది, మోసం

రోజ:— హ — హ — హ — మోసం ఓ వెఱ్ఱిదులాజీరావూ, మోసం, యెవనికంటె మించిన మోసం, మోసమనేశబ్దానికి నీతిలేదు, నియమంలేదు, ఆడుదాన్ని మా సహాయంతో ఆదరించి, ఝాన్సీరాజ్యపట్టభద్రత్వం వహించే, దుర్బుద్ధిమోసం కాదా? మాఅనుగ్రహంతో రాజ్యాక్రమణజేసి, మానెత్తిమీదేటోపీ బెట్టప్రయత్నం మోసంకాదా ? మోసం (అని పండ్లుకొరుకు చుపడును)

దులా:— (కోపంతో) ఓయీ వ్యర్థప్రలాపీ, నోరుమూయుము, నిస్సహాయుడవై, ప్రాణభయార్తుడవై, దిక్కులేకతపించునిన్ను రక్షించి, కోటమర్మమెరిగించి, శత్రునిశ్శేష మొనర్చినందులకు, ఫలము, వి..ష.ప్రయో..గమా.

విశ్వ: అమ్మ బాబో విషప్రయోగమే. హా, త్యాహత్య (అనిపారిపోవును ప్ర్యాక్ గోజుదొరకళలునిష్క్రమింతురు)

దులా:–(కుర్చీనుండి లేచి క్రిందపడిమరల లేచుచూ) విషం, విషం, రాణులకు రాణివైయున్న మహారాణిని హత మార్చిన ఫలం విషం. ప్రాణమును ప్రాణమైన కన్నగడ్డగర్భమున, చిచ్చు పెట్టినందులకు, ఫలం విషం స్వార్థమును [illegible]న్నై, శత్రువుతో చేయి గలపి, కోటమర్మ మెరింగించినందుకు ఫలితం, విషం, [illegible] నీ విట్టిదిక్కు లేని [illegible], [illegible] పు [illegible] [illegible] వచించు, [illegible] నీవు [illegible] లేదు, నీవు పలుకమ్మ [illegible] తో త్తుపు. నీవు [illegible] దేశముకళంకితమై పోయినది, [illegible] ములమైన రత్నగర్భను, చవిటిపఱ్ఱగా చేసినావు, యి దేశాని మాతృప్రేమ, యి దేశానికి బిడ్డలపై జల్లు [illegible] కటాక్ష వీక్షణ ప్రసారము యి దేశానికి పౌరుషకృపాణపటుత్వం

మ॥ సిగ్గున్ యెగ్గునులేక సాటిజగముల్ । చీ యంచు రోయంగ నీ
వగ్గెన్ దీర్చిన పాపకర్మఫలమే । పండెన్ స్వజాతీయులన్
బుగ్గిన్ గల్పిన నీచుడా పరుల మూ । పుల్ పట్టు దౌర్భాగ్యుడా
నిగ్గుల్ దేలిన దేశసంపదకు హా । నిన్ గూర్చు పాపండుడా.

(తూలుచూ) మహారాణీ, మహారాణి, నాపాపమునకు ప్రాయశ్చిత్తము లేదు. సర్వాంగసుందరమై, సస్యశ్యామలమైన, ఝాన్సీ రాజ్యమును, స్మశానక్షేత్రమొనర్చిన, నాపాపమునకు ప్రాయశ్చిత్తము లేదు, మాతలకుమాతవై, రాణులకుమహారాణివై, సర్వసద్గుణ భరితసంపన్నవై, సమస్తజనసేవితపాదాంబోజవై, సకలజగత్ప్రకాశ యశో విరాజిత, మంగళమయమూర్తివై, సర్వలోకభీకర, శాత్రవారణ్య విధ్వంసప్రళయదావాగ్నివై, నాదేశం, నాజన్మహక్కును, దేశసేవానంద నిష్టానియుక్త, కార్యనిర్వాహక వ్రతదీక్షాకంకణ హస్తవై, కత్తిఝుళిపించి, కదనరంగమునదూకిన, వీరమాతవగునిన్ను, (దుఃఖముతో) హా, తమార్చిననా, పాపమునకు ప్రాయశ్చిత్తము లేదు,

ఓయీ దులాజీరావూ, కన్నగడ్డయైన రత్నగర్భ గర్భమున చిచ్చు పెట్టినప్రయోజన మేమో, యిప్పటికైనాచవిజూచితివా? లేదు లేదు. పా.మం.దు.డా లేదు.

సీ॥ ధనమునకై గడ్డి । తినిన నీయుదరమ్ము
కుక్కనక్కలు పొంచి । మెక్కునాడు
గతిలేక పగతుర । కాళ్ళపై వ్రాలు నీ
తలను రాబందుగుల్ । దన్నునాడు
కన్నగడ్డను పండ । గాల్చునీ హస్తముల్
కాకఘూకమ్ములు । పీకునాడు
దాస్యజీవనవృత్తి । దవిలిజీర్ణించునీ
సర్వాంగముల క్రిముల్ । బర్వునాడు
తే॥గీ॥ కడగిబొమికలు మట్టిలో । గలయునాడు
భూతరూపమ్మునన్ గాంచి । పొగిలిపొగిలి
కన్నజనని సమానయై । గాచురాణి
గళము నులిమిన ఫలమేమొ । తెలియగలవు.

(తూలిక్రిందబడికూర్చొని) పొరపడ్డాను, యేకన్నగడ్డకొరకు, స్వార్థమున్ఠింభరత్వముతో ద్రోహ మొనర్చితినో, ఆకన్నగడ్డ, ఆరత్న గర్భ, ఆమాతృదేవి, ఆభారతమాత, నాపాపం క్షమింపగలదు, (అని చేతులుజోడించి) తల్లీభారతమాతా, నాయీఅవసానదశలోనీకిదేనా జోహారులు, సస్యశ్యామలఫలతరుశోభితోదరీ, నీకిదేనాధన్యవాద ములు, ధన్యజీవీ, నీకిదేనాకృతాంజలులు, భాగ్యదాయినీ, నాసా ష్టాంగనమస్కారములు, కరుణామయీనాఅంతిమకోర్కెనాలింపుము.

తే॥గీ॥ విప్లవజ్వాల నద్దెసల్ । విసరుగాత
భరతపుత్రులు స్వేచ్ఛమై । బ్రతుకుగాత
దేశవిద్రోహులిటు కడతేరుగాత
భవ్యగుణగణవిఖ్యాతి భరతమాత
(పడిపోవును—తెరపడును.)

—:: సంపూర్ణము ::—

# నావద్ద దొరకు గ్రంథములు

| | | |
|---|---|---|
| క్విట్టిండియా విప్లవం | .. | వెల రు 1—4—0 |
| ఢిల్లీకోట | .. | 1—4—0 |
| విప్లవజ్వాల | ... ... | 1—4—0 |
| ఝాన్సీరాణి | ... ... | 1—4—0 |
| బోసుబాబు (హరికథ) | ... ... | 1—0—0 |
| దేశీయరవ్వలు (ఖండకావ్యం) | ... | 0—8—0 |

యెడ్లపల్లి కోటయ్యగారిచే రచింపబడిన గ్రంథములు

| | | |
|---|---|---|
| గాంధేయ విజయం | ... ... | 1—8—0 |
| కాంగ్రెసు నిర్మాణకార్యక్రమం (బుఱ్ఱకథ) | ... | 0—8—0 |
| గీతాసామ్యవాదం (వచనం) | | |

అచ్చులోనున్నవి

రైతుకూలీ ప్రజారాజ్యం (నాటకం)
అల్లూరి సీతారామరాజు (హరికథ)
ఝాన్సీ లక్ష్మీబాయి (హరికథ)

కావలయువారు:—

ప్రత్తిగొడుపు రాఘవరాజు
ఈమని, (వయా) దుగ్గిరాల, గుంటూరుజిల్లా.